గృహలక్ష్మి



# GRIHALAKSHMI

15th AUGUST 1958

l. 27 No. 8

40 nP.

# మహిళల ఆరోగ్య రక్షణకు

## మాదీఫల రసాయనము

ఇది ముదిరిన మాదీఫలముల రసముతో తయారు చేయబడినది. గర్భిణి స్త్రీలకు కలుగు వాంతులకు (వేవిళ్లు) యిది సంజీవివంటిది. తల తిరుగుడు, వాంతులు, అరోచకము, అజీర్ణము, మలబద్ధకము, నిద్రలేమి మొదలగు జబ్బులకు వజ్రాయుధము, జ్వరవేగమును తగ్గించుటలో యీ రసాయనము పేరుపొందినది. ఇది తేనెవలె యుండి నోటికి రుచిగను యింపుగను నుండును.

3 ఔన్సుల బుడ్డి రు. 1 - 25 న.పై.

## గర్భరక్షక

స్త్రీలు బలహీనులగుటచేత గర్భము ధరించిన పిమ్మట పెక్కు రుగ్మతల పాలగుచున్నారు. ముఖ్యముగ వీరలకు గర్భస్రావము, అకాల ప్రసవము, అప్పుడప్పుడు కడుపునొప్పి, నడుము నొప్పి, రక్తహీనము, శరీరమందు నీరుచేరుట, బలహీనము, అలసట, ఆయాసము, అజీర్తి, మలబద్ధకము మొదలగు జబ్బులు కలుగుచున్నవి. ఈ 'గర్భరక్షక' సేవించిన పై జబ్బులు రాకుండుటయే గాక ప్రసవించువరకును శరీరము మంచి ఆరోగ్యస్థితి గలిగియుండి నిండుమాసములు గర్భము ధరించి సుఖముగ ప్రసవించెదరు.

3 ఔ॥ రు. 3 - 10   6 ఔ॥ రు. 5 - 50

## క్షీరబలా తైలం

స్త్రీలకు ఋతు దోషముచే గల్గు వాత వ్యాధులు, పార్శ్వపు తలనొప్పులు, తలపోటు, గర్భవాతము, శరీరము బలిసియుండుట, మూర్ఛ, అపస్మారవ్యాధులు, క్షయవ్యాధి, నరముల బలహీనత, యీ తైలముతో అభ్యంజన మొనర్చిన నివర్తించును.

6 ఔ॥ల బుడ్డి రు. 3 - 0

## సౌభాగ్యశొంఠి

### బాలింత లేహ్యము

ప్రసవానంతరమున స్త్రీలకు బాలింతకారమును ఒక ఘాటు ఔషధమును యిచ్చు ఆచారము మన దేశమున చిరకాలముగ నున్నది. అయితే ఈ కారమును లెక్కలేనన్ని పచారిదుకాణపు సామానులతో తయారుచేసి యిచ్చుచున్నారు. ఇందు కలియు వస్తువుల పరిమాణమును, పదార్థజ్ఞానమును పాటింపక మందును తయారు చేయుదురు. ఈ కారము వారికి వేడిచేసి అనేక రుగ్మతలు సంభవించుచున్నవి. ఈ సౌభాగ్య శొంఠిని వాడిన ఆరోగ్యము చెడక తల్లియు బిడ్డయు సుఖముగ నుండగలరు. తల్లికి సమృద్ధిగ పాలుపడును.

బుడ్డి రు. 2 - 0

## ప్రమేహాంతకం

(తెల్లబట్ట వ్యాధికి)

అనేక కారణములవలన స్త్రీలకు గర్భాశయము నుండి తెల్లటిద్రవము వెడలుచుండును. స్త్రీ జాతి యందు యీ జబ్బు సర్వసాధారణముగ నుండును. పసిపిల్లలకుగూడ యీ వ్యాధి సంభవించుచున్నది. చిరకాలముగ యీ వ్యాధివల్ల బాధపడువారి గర్భాశయము పుండగును. అట్టివారికి మేహజ్వరము, దగ్గు, నిస్సత్తువ, సంతాన హీనత సంభవించును.

బుడ్డి రు. 4 - 0

# కేసరి కుటీరం ప్రైవేటు లిమిటెడ్

15, వెస్టుకాట్ రోడ్డు, రాయపేట, మద్రాసు-14.

ఆంధ్ర ప్రదేశ్‌కు ఏజంట్లు:

శీతారాం జనరల్ స్టోర్సు. బెజవాడ - సికిందరాబాదు.

# అపారమైన శక్తియుత్సాహములే మీ ప్రతిష్ఠను కాపాడగలవు

# అమృత

## మధురమైన పానీయము




వ్యాయామ క్రీడల్లో పాల్గొనేవారందరికీ అవసరమైన ఉత్సాహ శక్తుల్నియిచ్చే ముఖ్యసాధనం అమృత - ఆ బాలగోపాలానికి అద్భుతమైన టానిక్. సేవించడానికి తియ్యగావుండీ మాంచి చురుకుదనాన్ని కల్గిస్తుంది. ఈ అద్భుతమైన పానీయం ప్రసిద్ధమైన మూలికలచేతనూ ఫల రసాలతోను తయారుచేయబడింది. అందరికి ఆత్మబంధువు లాటిది.

## కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్ మద్రాసు-14

---

ఆంధ్రప్రదేశ్‌కు, తమిళనాడుకు ఏజంట్లు :

**సీతారామ జనరల్ స్టోర్స్, బెజవాడ, సికింద్రాబాదు, మధుర.**

---

వ్యవస్థాపకులు
డాక్టరు కే. యన్. కేసరి

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను పెంపొందించుట కేర్పడిన సచిత్ర మాస పత్రిక

ప్రొప్రైటర్లు : కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్.

ఆక్టింగ్ ఎడిటర్
సి. సి. పున్నయ్య

సంపుటము ౩౧] ఆగస్టు 1958 [సంచిక ౮

# విషయసూచిక





సిమ్లాలో పంజాబు రాష్ట్ర చిత్రకళా ప్రదర్శనాలయంలోని వసంత కాలంలో సుందరాంగులు పక్షులకు ఆహారం వేస్తున్నట్లుగా గీసిన పహాడీశైలి చిత్రము.




జయజయ గృహలక్ష్మి స్త్రీ సఖి! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణి!



# స్వతంత్ర భారత్ జిందాబాద్



ప్రతి స్వతంత్ర దేశానికి స్వాతంత్ర్యదినము పర్వదినము. దానినే మనముకూడ ఆగస్టు 15వ తేదినాడు ఉత్సవాలు, ఊరేగింపులు, సభలు, సమావేశాలు, విందులతో పర్వదినంగా పరిగణిస్తున్నాము. స్వాతంత్ర్య సిద్ధికై అష్టకష్టాలుపడినా, అఖండ త్యాగాలు చేసినా మన ఆశయ లక్ష్యాలు సిద్ధించడం గర్వకారణం.

మన జాతీయ సౌభాగ్యమున కవసరమగు స్వాతంత్ర్య సిద్ధికై దేశానికి నాయకత్వము వహించి మనలనుముందుకు నడిపిన జాతీయ నాయకులకు జోహారులర్పించి వారి ఆదర్శలక్ష్యాలను, స్వార్థత్యాగమును, చిత్తశుద్ధిని అనుసరించుటకు దీక్షవూన వలసినదీ రోజు. అంతేకాదు - మన జాతీయపురోగమనాన్ని, సాధిస్తున్నఘన విజయా

లను పారద్రోలుకొని ఎప్పటికప్పుడు జాతీయ సౌభాగ్యము నుద్దేశించి మన గురుతర బాధ్యతలను గుర్తించి ముందంజ వేయవలసిన రోజు యిది.

ప్రపంచములో అన్ని దేశాలతో బాటు సుస్థిరమైన శాంతి భద్రతలను కాంక్షిస్తున్నాము. అభివృద్ధి అభ్యుదయాలు యింట, బయటకూడ శాంతిభద్రతలమీదనే ఆధారపడియున్నవని మనకు తెలుసు. ప్రపంచశాంతి నుద్దేశించిన మన కృషిని, విధానాలను ప్రపంచదేశాలు ప్రశంసిస్తున్నవి. మనదేశ కీర్తిప్రతిష్టలు భారతప్రధాని పండిట్ నాయకత్వము క్రింద యినుమడించినవి. పండిట్ నెహ్రూ నాయకత్వము మనకు జాతీయ, అంతర్జాతీయరంగాలలో అనుకూల్యమైనది.

అయితే ఆంతరంగికంగా జాతీయ సమస్యలు సరళమగుతున్నవని యనడానికి సాహసించలేము. అభివృద్ధి అభ్యుదయాల నుద్దేశించి ప్రణాళికలమలు జరుగుచుండగా ఎప్పటికప్పుడు ప్రజలకు బరువు భారము లధికమగుచున్నవి. ఆర్థికదుస్థితికి కారణమయిన నిరుద్యోగం, చాలినంత ఆదాయలేమి ప్రజల నెప్పటికప్పుడు చీకాకుపరుస్తున్నవి. ఈ సందర్భమున దేశ, కాల పరిస్థితులకనుగుణమైన అభివృద్ధి, అభ్యుదయాలను రూపొందించుకొనుటకు వాస్తవికపరిజ్ఞానం అత్యవసరము. ప్రజలకు చాలినంతపని, జీవితావసరాలు సమకూర్చగల అభివృద్ధికార్యక్రమాలు అమలుజరుగాలి.

కలిమిలేముల మధ్యగల అఘాతము పూడిపోవుటకుగాను ప్రజలలో పరస్పర సద్భావ, సహాయ సహకారములు పెంపొందాలి. ప్రపంచములో ఎవరికి వారు తమ స్వీయ సౌభాగ్యముతో తృప్తిపడవలసినరోజు లివికావని, స్వార్థత్యాగంతో ఉమ్మడి శ్రేయస్సు పట్ల ఆసక్తి చూపవలసియున్నది. జాతీయరంగంలో ఉమ్మడి శ్రేయస్సు లక్ష్యమైననేగాని శాంతి సౌభాగ్యములు సిద్ధించినట్లు కానేరదు.

# అగ్నిజ్వాలలు

మూలం :
శ్రీ భైరవ ప్రసాదగుప్త

అనువాదం :
శ్రీ పురాణపండ రాధాకృష్ణమూర్తి

(గత సంచిక తరువాయి)

"అయితే అక్కా! ఈ కథ "ఆసరా" కథ కంటెకూడా బాగా వ్రాయాలి. జగదీశ్ బాబు "ఆసరా"ని ఎంతగా పొగిడాడో తెలుసా? నేను ఆయనతో ఈ కథ మా కక్కర లేదని స్పష్టంగా చెప్పేసాను. ఆమె నా పేరుతో ముద్రించుకోవాలని యిచ్చిందని స్పష్టంగా చెప్పేసాను" అంటూ శశి రాధ వడిలో తలవుంచి మంచంమీదకి కాళ్లు జాచింది.

"కాని నువ్వాకథ ఒక్క రాత్రిలో పూర్తిచేసావని ఆయన చెప్పావరే?" ఏమీఎరగని దానిలా పల్కింది రాధ.

"ఓ! హో! అలాగా? అక్కా నువ్వెంత అమాయకురాలివి. జగదీశ్ బాబు ఎటువంటివాడో నాకేంతెలుసు! అలాంటివాళ్ళని నచ్చచెప్పాలంటే నీలాంటివారు కావాలికే?" చివరిజడ అల్లుకుంటూ పల్కింది శశి.

"అయితే ఏమీ-ఈ మధ్య జగదీశ్ బాబుతో నీకేమైనా పరిచయంకలిగిందా?" మాత్సర్యంతో ఏదో తెలుసుకోవాలని పల్కింది రాధ.

"ఆ - ఏరోజునైతే కథ యివ్వడానికి వెళ్ళానో ఆ నాడే కొంత పరిచయం కల్గింది." కళ్లు త్రిప్పుతూ పల్కింది శశి.

"నన్ను గురించి ఆయన ఏమైనా అన్నారా?"

"నిన్నుగురించా?" శశి క్రింద పెదవిమీద చూపుడు వ్రేలుంచి ఏదో స్మరణకు తెచ్చుకుని పల్కింది - "ఆ ఆ - నిన్ను అస్తమానం బాగా పొగుడుతాడు. నువ్వు చాలా మంచిదానివని అమాయకురాలివని అంటూంటాడు. నువ్వంటే ఆయనికి చాలా యిష్టంగా ... ... కాని నువ్వాయన్ని గురించి ఈ మధ్య ఏమైన విన్నావా?"

"ఏమిటని?"

"ఆయన పెళ్ళి స్థిరమైందని సుధ చెప్పతోంది. త్వరలోనే ... ... ..." అంటూ శశి రాధ వదనంలోకి కళ్లెత్తి చూడసాగింది.

రాధ ఒక్కసారి ఉలిక్కిపడింది. కాని మరుక్షణంలో సంభాళించుకుని "శశీ! ఓ సారి యిప్పుడాయన దగ్గఱకి వెళ్ళివద్దామా?"

"ఎందుకు?" ప్రశ్నించింది శశి.

"ఊరికేనే - ఊరికేనే!! మరి ఆయనకు ధన్యవాదాలర్పించడానికి - రావా?" ఏదో మాట్లాడాలని ప్రయత్నించింది రాధ.

"నేనాయనకు ధన్యవాదా లర్పించే వచ్చాను. నువ్వు వెళ్ళదల్చుకుంటే కారు తెప్పిస్తాను. కాని యింత రాత్రయింది ... ..." అంటూ శశి రాధకేసి చూసింది."

"ఇప్పుడేం టైం అయి యుంటుంది?" అని ప్రశ్నించింది రాధ.

"తొమ్మిది దాటి ఉంటుంది." శశి లేచి కూర్చుని పల్కింది – "అక్కా నీకీ విషయం తెలియదు కాబోలు - నాన్నగారు నిన్నుకూడా ఒకయింటిదాన్ని చేయాలని ప్రయత్నాలు చేస్తున్నారు. నీ పెళ్ళిమాట యించుమించు స్థిరమైపోయిందని అమ్మ అంటోంది."

"ఏవిటీ" కొంచెం ఆశ్చర్యంగాను, తీవ్రంగాను పల్కింది రాధ.

"ఏంలేదు, ఏంలేదు. సరేకాని నువ్వు జగదీశ్ బాబు యింటికి వెడతావా? కారు తెప్పించనా!" వెళ్ళిపోతూ ద్వారం దగ్గర ఆగి పల్కింది శశి.

"వెళ్లను" కొంచెం ఆక్రోశంగా జవాబు చెప్పింది రాధ. శశి వెళ్ళిపోయింది. రాధ శరీరం క్రోధంతో కంపించసాగింది. ఆమె ఆత్మ నిధ్వరహితంగా గట్టిగా అరచింది. "వీల్లేదు వీల్లేదు. అలా జరగదు. జగదీశ్ నన్ను ప్రేమిస్తున్నాడు. నేను జగదీశ్‌ను ప్రేమిస్తున్నాను. మమ్మల్ని ఎవరూ వేరుచేయలేరు." అంటూ తలగడామీద తల పెట్టుకుని హృదయంమీద చేతులు పెట్టుకుని వెక్కి వెక్కి ఏడ్వసాగింది.

చాలాసేపు ఏడ్చిన తరువాత హృదయం తేలికపడగా మంచంమీదనుంచి లేచింది. "ఒకసారి. - ఒకసారి తప్పక జగదీశ్‌ను కలుసుకుంటాను. బహుశా ... ... ..." ఆమె కళ్ళలో విచిత్ర కాఠిన్యంతోటీ- హృదయంలో ఒక విచిత్ర సాహసంతోటీ లేచి గదినుంచి బయటకు నడచింది.

జగదీశ్ గది దగ్గరకు ఆమె వచ్చేసరికి ఒక కారు అప్పుడే ఆగిన ధ్వని వినిపించింది. రాధ ధ్యానంతో అలా చూసింది. అది జగదీశ్ కారే. బహుశా జగదీశ్ సినిమా చూసి తిరిగివచ్చి ఉంటాడు. ఆమె ఓవైపు నిలబడిఉంది.

సుధ కారులోంచిదిగి టకటక ధ్వనితో లోపలికి పోసాగింది. ప్రక్కనే ఉన్న స్త్రీమీద ఆమె దృష్టి పడింది. హఠాత్తుగా కాస్త గట్టిగా ప్రశ్నించి "ఎవరు నువ్వు?"

"నేను ... ... నేను రాధను." నెమ్మదిగా భయంతో సిగ్గుతో సమాధానమిస్తూ "సుధాదేవి నమస్తే" అంటూ సుధ దగ్గరకు వచ్చింది.

"నమస్తే" అంటూ విసురుగా "ఇంత రాత్రియ్యాక యిలా వచ్చారేం?"

"కొంచెం ... ... కొంచెం ... ... జగదీశ్ బాబుతో పనిఉంది." సిగ్గుతో సమాధానమిచ్చింది రాధ.

"జగదీశ్ బాబుతో నీకేంపని ఉంటుంది. నువ్వనవసరంగా ఎందుకస్తమానం మా అన్నయ్య వెనకాలే తిరుగుతావు! నువ్వు నీ స్థితి చూసుకోకుండా ఎందుకలా ప్రవర్తిస్తావు? కాలేజీలో తలెత్తుకు తిరగాలని లేదా? నీ మూలాన మా అన్నయ్యకికూడా అపకీర్తి రప్పించదలచావా? నీలాంటివాళ్ళెక్కడా లేరు"

"ఏమిటీ ... ... సుధా! ... నీ యిష్టంవచ్చినట్లు మాట్లాడేస్తున్నావు. కాస్త వెనుకాముందూ ఆలోచించక్కర్లేదా? ఆ జగదీశ్ బాబు నన్ను ప్రే ... ... ..."

"నాకంతా తెలుసు" ఆ పల్కుల్లోని ప్రతీ అక్షరాన్ని నొక్కి నొక్కి కఠినంగా తీవ్రంగా పల్కింది సుధ "రెండు మూడుసార్లు జగదీశ్ హోటలుకి తీసుకువెళ్ళి టీ యిప్పించాడని, రెండు మూడుసార్లు కార్లో షికార్లకి తీసుకువెళ్ళాడని అతడు నిన్ను ప్రేమిస్తున్నాడనుకున్నావు. ఛీ - ఛీ నీ ముఖంచూడకూడదు. సైతానులా పట్టుకున్నావు. నీకు యిలా మాట్లాడ్డానికి సిగ్గు కల్గటంలేదూ. ఎందుకు యీ అందని ఆశ - జగదీశ్ బాబుకి శశికి వివాహం ఏర్పాటు అయిపోయిందని నీకు తెలియదు కాబోలు! ఇక ఎప్పుడైనా యిలాంటి మాటలు మాట్లాడావా జాగ్రత్త! శశి యింట్లో నీకు లభించే ఆ కాస్త ఆదరం కూడాపోతుంది."

రాధ బుఱ్ఱ గిరిగిర తిరిగిపోతుంది. ఆమె కనుల ఎదుట కారుచీకట్లు ఆవరించినవి. తడబడే కాళ్లతో వెనక్కు తిరిగింది. అప్పుడే జగదీశ్ ఠీవిగా కారులోంచ దిగుతూపల్కాడు - "సుధా! ఆ విషయాన్నే నెమ్మదిగా చెపితే బాగుండునేమో?"

జగదీశ్ పల్కులు రాధకి మండుతూన్న కళ్ళలో కారం జల్లినట్లుంది. ఆమె విలపిస్తూ "జగదీశ్ బాబూ! మీరిక్కడే ఉన్నారా? సుధ నన్ను అలా

నిందిస్తుంటే మీరు ......" అంటూ వెళ్ళి జగదీశ్‌ను సమీపించింది.

కాస్త తేలిగ్గా నవ్వి జగదీశ్ "సుధ ఏమీ పొరబాటుగా మాట్లాడలేదే. కాని ఆమాట పద్ధతి నాకు నచ్చలేదు. రాధాదేవీ! నేను జమీందారు బిడ్డను. జమీందారు బిడ్డనే వివాహం చేసుకోడం, అలాంటి దాని నన్వేషించడం నాసహజస్వభావం. కొంత కాలం మిమ్మల్ని పరీక్షించాను. ఇప్పుడు శశిని పరీక్షిస్తున్నాను. రేపు .........మీకు నా మాటల్లోని అంతర్యం అర్థంకాకపోవచ్చు. నా ఉద్దేశ్యం నేను జీవితాంతం వరకూ పరీక్షిస్తూ ఉండడమే. ఇలాగ డజన్లకొలదీ వ్యక్తుల్ని పరీక్షించాను. ఇంకా వందలకొలదీ మందిని పరీక్షిస్తాను. విలువైనవి మరీ విలువైనవి ధగధగ మరీ ధగధగా మెరిసేవి నాకు కావాలి. ప్రపంచంలో నాకు కావాలి ప్రపంచంలో నాకు వాటికి ఎన్నటికి లోటులేదు. శశి కేవలం ఇంట్లో శోభను వృద్ధిచేయడంకోసంమాత్రం వస్తోంది. అందుకుమీరు యోగ్యులు కారు. మరియు మీకీ విషయం బాగుగాతెలుసు నేను చాలాచాలా సరదా మనిషని. అంచేతనే ముందుగానే స్పష్టంగా చెప్పేస్తూన్నాను. మీరు నా విషయమై మరో అభిప్రాయం పెట్టుకోకండి. మీలాగే ఇంతకు ముందు అనేకమంది యిలా నేపొరబడ్డారు. కాస్త వేడి టీ త్రాగుదాం వస్తారా?"

"అన్నయ్యా!" క్రోధంగా "ఏమిటి ప్రేలుతున్నావు ఈ కుక్కతోటి" అన్నది సుధ.

తుఫానులోని లతావృక్షాలులాగ రెపరెపలాడిపోతూన్న హృదయాన్ని చేతబట్టుకుని పారిపోయింది రాధ. సుధ పల్కులు శశిమాటలూ జగదీశ్ వచనాలు ఆమె కర్ణభేరిని బ్రద్ధలు చేసేస్తూన్నాయి.

5

రాధకారాత్రి ఎలాగడిచిందో అంధకారానికి మాత్రం తెలుసు. తెల్లవారేసరికి ఆమె కళ్ళు తెరచుకుని ఉన్నాయి. ఎదురుగా బాలభానుని కిరణాలు ప్రసరించే కాంతిలో ఆ నాటి నూత్నజీవితంద రహాసం చేస్తోంది. కుంపటిలోపడి వికసించిన గులాబిలా ఒక నూతానందం వికసించి నవ్వుతోంది. "చిన్న పిట్టల కిలకిలారవాలలో ఏదో నూత్న ధ్వని ప్రతిబింబిస్తోంది.

ఆమె లేచి కూర్చుంది. ఆమె మోములోనుంచి ఏదో తేజస్సు వర్ధిల్లుతోంది. కనులలో ఉజ్జ్వల ప్రకాశం శోభిల్లుతోంది. ఆమె హృదయంలోను మస్తిష్కంలో వ్యాప్తమై నీ ఆశాచంద్రుని కారు మబ్బులు మూసివేస్తున్నాయిఅనే ఆమె భావాలు నష్టమైపోయాయి. నేడామె పినతండ్రిని - పినతల్లిని - శశిని జగదీశ్‌ని - సుధని అందరిని బాగా అర్థంచేసుకుంది. నేడు తాను వారికోసం చేసిన సేవ — పరిశ్రమ — త్యాగం — ప్రేమ — వాటి మూల్యం — మహత్తరంగా పరిణమించాయి. అందరికి అన్నీ చేయడం నేడు వారిలో అందరికి దూరమైపోయింది. తాను, ఇక వారితోఉండి ఒక యంత్రపు చక్రంలా అరిగి అరిగి మరణించవలసిందేనా? నేడు తాను వారి స్వార్థమునకు సాధనం అయింది. కాని ఒకానొక రోజున తానుకూడా ఏదైనా శక్తిని సంపాదించి జీవన్మార్గాన్ని సుఖపరచుకోగలదా? వీల్లేదు — వీల్లేదు — అలా జరగకూడదు. ఇక వారితో తనకి ఎన్నడూ కలయిక జరగదు. వారు, తను వేరు. వారి మార్గం వేరు, తనమార్గం వేరు. నేటినుంచి ఏ భ్రమా ఉండదు. నేడు ఆమె తన మార్గాన్ని గుర్తించ గల్గింది. ఇప్పుడామెకేమీ భయంలేదు. ఆమెలో దౌర్బల్యంలేదు. నేటినుంచి ఆమె తన మార్గంమీదనే నడుస్తుంది. ఆ మార్గంమీద వందలకొద్దీ, లక్షలకొద్దీ, కోట్లకొద్దీ ప్రజలు నడిచారు. వారితో నడిచే తనుకూడా ఆ జీవితాన్ని సఫలం చేసుకుంటుంది. పినతండ్రి — పినతల్లి — శశి — సుధ జగదీశ్ వారందరూ తనకు చేసిన అన్యాయానికి ప్రతీకారం చేసుకుంటుంది.

రాధ లేచినిలబడింది. ఆమె లలాటం రుమె

స్తోంది. ఆమె రోమరోమాల్లోనూ ఏదో అవ్యక్తమైన ఉత్సాహం తరంగరూపం దాల్చింది. ఆమె నయనాల్లో ఒక నిశ్చయం — తెంపు ప్రకాశిస్తున్నాయి.

అప్పుడే ఆమె పినతండ్రి — "అమ్మాయీ రాధా ! అమ్మాయి రాధా ! ! " అంటూ పిలుస్తూ ఆమె గదిలోకి ప్రవేశించి పల్కాడు. "అమ్మాయి Express Telegram రాత్రి 11 గంటలకు వచ్చింది. నేనాసమయంలోనే నీకీ శుభసమాచారం అందంజేయాలని ప్రయత్నించాను. కానినువ్వు నిద్రలో మునిగిపోయావు - తీసుకో-చదువు."

"ఇందులో ఏముంది" తేరపారిచూస్తూ ప్రశ్నించింది రాధ.

"శేఠ్ రామలాల్ తన అంగీకారాన్ని తెలియజేస్తూ వార్త పంపారు. నీకీ సంబంధం స్థిరమైనది". ఆనందంగా నాట్యంచేస్తూ పల్కాడు పినతండ్రి.

రాధ కళ్ళు భగ్గుమన్నాయి. ఆమె పళ్ళు పట పట కొరుకుతూ పల్కింది "నువ్వెవ్వడ వసలు నన్ను తీసుకెళ్ళి ఆ ముసలాడికి కట్టిబెట్టడానికి."

"ముసలివాడా ముసలివాడు ! నీతో ఎవరు చెప్పారు. 45 సంవత్సరాలింకా పూర్తిగా నిండలేదు. ఇప్పటికి రెండు పెళ్ళిళ్ళు చేసుకున్నాడు. అయితే ఆయనకు ఓ పిల్లాడైన పుట్టలేదు. లక్షలకొద్దీ వ్యాపారం-ఆయన కింక తననేవాళ్ళుకూడా ఎవరూ లేరు. అమ్మా నువ్వు మహారాణిలా ఆ యింట్లో ఉండొచ్చు నువ్వు ... ... "

"నోర్ముయ్" రాధ కళ్ళలో అగ్ని జ్వాలలు ధగధగాయమానమైన వెల్గును సూచిస్తున్నాయి.

"ఏమిటమ్మాయ్ యిలా అంటున్నావు నీమతిగాని పోలేదుకదా ? నేను నిన్ను పెద్దదాన్ని చేసి చదువు సంధ్యలు చెప్పిస్తే నా మీద విశ్వాసముంచడానికిబదులు నీ విలాగే నా మాట్లాడేది. ఓ...... ఓహో ... ఏమిటి నా కేసి అలాచూస్తావేం ? పిచ్చిదానివి కాలేదు"గదా ? రాధా రాధా వెనక్కి జరుగుతూ పల్కాడు పినతండ్రి.

"నోర్ముయ్ లేకపోతే, లేకపోతే..." లేస్తున్న రాధ చేతులు కంపించసాగాయి. కళ్ళనుంచి అగ్ని కణాలు రాలసాగాయి.

రాధయొక్క ఆరూపం చూచేసరికి ఆమె పినతండ్రికి ఒకానొకనాడు తనమిల్లుకార్మికులు సమ్మెచేసిన విషయం హఠాత్తుగా జ్ఞాపకానికి వచ్చింది. ఆ రోజునకూడా ఇదేరీతిగా క్రోధంతో కంపితహస్తాలను లేవనెత్తి తనపై పురువచ్చారు కార్మికులు. వారి కళ్ళలోకూడా ఇలాంటి అగ్నిజ్వాలలే ప్రస్ఫుటితమైనాయి. పినతండ్రి మరలిపోయి వెనక్కి తిరిగి వెళ్ళిపోతూ వణుకుతూనే యిలా అన్నాడు "ఇక నీ కీ యింట్లో స్థానంలేదు. పో, ఇక్కడినుంచి పో" అంటూ గబగబా భయంతో తనగదివైపు పారిపోయాడు. ఇక తనకీ గృహంలో స్థానంలేదనే విషయం ఒక్క క్షణంలో రాధకి తెలిసిపోయింది. క్షణంలో తనకీ ప్రపంచంలో మరెక్కడా స్థానం ఉందనే ప్రశ్నకి సమాధానంరాలేదు ! ఇక యిలాంటి వాటికి ఆమెలొంగేది కాదు.



# క్షణికం!

శ్రీమతి యు. ప్రభంజనరాణి

—(०)—

భారతికి యిది ప్రథమానుభవం. ఇంతకుముందెప్పుడూ ఇలా భర్తమీద అలిగి పుట్టింటికి రాలేదు. అనేకమార్లు అలిగిందిగాని ఇంతగా పట్టించుకొని, ఉక్రోషం చూపడంమట్టుకు యిదే మొదటిసారి అని చెప్పాలి. ప్రసాద్‌ను విడిచి వచ్చేసింది – రాక అతనితో కాపురం ఎలా చేస్తుంది? తనలాంటి అభిమానం గల ఆడది ఎవతెగూడా ఆయన దగ్గర కాపురం చెయ్యలేదు–ఆయన చెయ్యించుకోనూలేడు. ఆడదంటే అంత చులకనా? గోడమీద ఎగిరే దుమ్ముకన్న హేయమా మరీ? .. అప్పటికీ పళ్లెత్తుమాటైనా అనకుండా అతనుచేసే తప్పులకు సరిపెట్టుకొంటూ, ఓర్పుతో నేర్పుతో సంసారం చేసుకుపోతున్నా ఎందుకొస్తుందా మూర్ఖత్వం - ఆ తృణీకారం – ఆ కోపము?

ఆడదంటే అంత అలుసైపోయిందేం ప్రపంచానికి? ముఖ్యంగా ఈ మగాళ్లకు స్త్రీలంటే ఆటవస్తువులకన్నా ఎక్కువ విలువ చెయ్యని వస్తువుల్లో జమ. స్త్రీ వహించే దీక్షా, ఆమె సేవా, ఆమె భరించే కష్టాలు, ఆమె సహనం, ఆమె త్యాగమూ ... ఎవరిక్కావాలి. ఈ మగాళ్లకు తమ స్వార్థంతప్ప మరేమీపట్టదు. అవసరమొచ్చినపుడు అనేక విధాల వగలుచూపి మురిపించి పన్లు చక్కబెట్టుకొంటారు. పనులు తీరాక ధర్మపత్నిని దాసీదానిలా ఇంటికి కావలికాయమంటారు. స్త్రీలు బానిసలా వీళ్లకు? కొవ్వలిలేక జంపన భాషలో చెప్తే పిల్లల్నిగనే యంత్రాలా స్త్రీలు? మగవాళ్లకు అధికారం ఎవరిచ్చారు? సృష్టిలో ఈ విభేదం ఎందుకుండాలి?

భారతి కోపం కట్టలు తెంచుకొంది. తన ప్రాణేశ్వరుడిమీద పట్టరాని ఆగ్రహం వచ్చింది. తనకు తెలియకుండా పళ్ళు పటపటా కొరికింది. తననుకూడా దేవుడే సృష్టించాడు. తనుకూడా ఉప్పుకారం తింటుంది అందరిమల్లె. తనకూ తన సొంత కోర్కెలు భావాలూ లేకపోలేదు. తనకూ పౌరుషం వస్తుంది, కోపం వస్తుంది. ఎవరికిరాదుమరీ? ఆయన తనమెళ్ళో తాళి గట్టినంత మాత్రాన తన ఆశయాల్ని కోర్కెల్ని భగ్నంచేసుకొని తన వ్యక్తిత్వానికి తిలాంజలి వొదలాలని ఎక్కడుంది?

నిజమే-తను ఒకటి కోరింది. అందులో తప్పేముంది? ఆ మాత్రం తనకు స్వతంత్రంలేదూ? భర్త యిచ్చే ఆజ్ఞలు శిరసావహించి తలతో పన్లుచేసే భార్యకు, భర్తవల్ల కొన్ని పొందాలని ఆశించదూ? తను మాత్రం ఏం ప్రతిఫలం కోరింది గనుక?

ఆలనాడు సత్యాదేవి అడిగినట్టు దేవలోకంలో పారిజాత పుష్పం తెచ్చివ్వమన లేదే! సీతకోరినట్టు బంగారులేడిని పట్టుకొచ్చి వాకిటనిలపమన్లేదే - పోనీ సిల్కు చీరలా, నెక్లెసులా - ఊహుఁ అలాంటి వేమీ దుస్సాధ్యమైనవి కోరలేదే - కోరిందేమిటి? చెప్పుకొంటె తనకు సిగ్గేస్తుంది, ఒక రోజు తనను ఆయన వెంట సినిమాకు తీసుకెళ్లమని. అంతే! అది తను నోరువిప్పి అర్థించిందల్లా.

దానికింత మొహంచేసుకొని చూశాడు. కన్నీళ్లు తుడవడానికి "అలా గే లే" అన్నాడు. సాయంకాలం పెందలాడే వంటా అదీ పూర్తిచేసుకొని, తీరిగ్గా అద్దం ముందు కూర్చుని ఎంత ముచ్చటగా ముస్తాబైందితను! ఎంత ఆశపడింది! ఆయన ఆఫీసునుంచి వస్తాడని ఎదురు చూసింది. ఊహుఁ - రాలేదు - ఆరున్నర దాటింది - ఏడైంది. తను ఇంక ఆశముగించుకొని ఉసూరుమంటూ మంచంమీద కుప్పగా కూలి, భరింపరాని అవమానంతో ముఖం యింత చేసుకుని కుమిలి కుమిలి ఏడ్చింది. అంత నిర్లక్ష్యమా! ... భార్య కోరక కోరక యింత అల్పమైనది కోరిందనీ, దాన్ని తీర్చే బాధ్యత తనకున్నదని గ్రహించ కక్కర్లేదూ?

ప్రసాద్ సరిగా ఎనిమిది గంటలప్పుడు యింటికొచ్చాడు - కట్టకాగితాలు పుచ్చుకొని.

"అయాం వెరీ సారీ భారతీ" అంటూ దగ్గరికొచ్చాడు ప్రసాద్. నవ్వుతో ఆ విషయం కొట్టిపారెయ్యాలని ఆయన యత్నం. ఆ నవ్వు తనను వెక్కిరిస్తున్నట్టు తోచి మరింత బాధపడింది భారతి.

ప్రసాద్ ఏదో చెప్పుకుపోతున్నాడు. "ఆఫీసులో యివ్వాళ మరీ వర్కు జాస్తయింది ... అందులో యివ్వాళే వొచ్చిపడ్డాడొక యముడు ..."

"చాల్లెండి. చెప్పాలంటే ఎన్ని దారకవు ..." కోపంగా అనేసి, విసురుగా వెళ్లిపోయింది భారతి. "మీరు క్లబ్బులకెళ్లటానికి మాత్రం టైం ముంటుందేం" అని అడగాలని నోటిదాకా వచ్చింది. మళ్లా ఎంచేతనో అడగలేకపోయింది. ప్రసాద్ ఆమెను వంటింట్లోకి వెంబడించాడు. "నేను చెప్పేది సాంతం వినిపించుకోవుకదా - ఎలా చెప్పు?" అని విసుక్కున్నాడు.

భారతి మొహం ఎర్రబడింది కోపంతో కళ్ళు జేవురించాయి. అవమానంతో ఆమె తల వొంగిపోయింది. కనుకొలకుల్లో నీరు జొటజొటనిండి, చెక్కిళ్లమీదికి బలబల ప్రవహించ సాగింది వెచ్చగా.

"నన్నెందుకిలా అవమాన పరుస్తారు. నేనింత భారంగా వున్నానా మీకు.

(443-వ పేజీ చూడుడు)




# శివ సాయుజ్యం

రాఘవ

ఉషాదేవి వుపగూహనా తన్మయత్వపు
నిషాలోంచి తెప్పరిల్లి — ఆవులించి —,
పొద్దు పొడిచింది
ప్రొద్దుతిరుగుడు పూవుముఖం విప్పారింది

ఉదయకిరణాలకు పుష్కరిణిలో
కమలాలు విచ్చుకున్నాయి
హృదయ పూర్వకంగా కర
కమలాలు జోడించి నమస్కరించాయి

తోటమాలి తన కుటీరంలోంచి
బయటికి వచ్చాడు
చాటునేదాగివున్న తుమ్మెద శిశు
ప్రియాతిరేకంతో ఎగిరిపోయాడు

మాలి చుట్టూ ప్రదక్షిణం
చేసాడు తుమ్మెదగాడు
తూలిపోతూవున్న శరీరాన్ని చూసి
మాలి మనస్సులో నవ్వుకున్నాడు

కర్రను మోపు చేసుకుంటూ
మాలి నడక సాగిస్తున్నాడు
జ్రుముని మకరందాన్ని గ్రోలడానికి,
పరిభ్రమించి తేలిగ్గా పూలబాలమీద వాలాడు

తృటిలో — ఎటులో — ఆ పువ్వు
సౌఖ్యాన్నందుకొని తృప్తిపడ్డాడు
చిరునవ్వుతో గాలికి తూగాడుతున్న, ఆ
పువ్వుని గని, నిర్వేదించాడు వయసు మళ్ళినవాడు

"నేనేం చేయను ?" — అంది పూవు
తెల్లమొగం వేసుకుంటూ దీనంగా —
"నేను మాత్రం ఏం చేయగలను ?" —
అని పెదవి విరిచాడు తెల్లగడ్డాన్ని
నిమురుకుంటూ ధ్యానంగా

"ఝుమ్మనే మా తుమ్మెద బావ
కనిపిస్తున్నాడా ?" — అని అడిగింది
ఒక దొంతర మల్లెపిల్ల
"నెమ్మదిగా వస్తాడులే ! వినిపిస్తుందిగా
వలపు పిలుపు" — అన్నాడు మలుపు కెళ్ళి

తోట మాలికి వయస్సు మళ్ళి,
తొమ్మిది పదులకు రెండు పదులు తక్కువ
బాట ప్రక్క పూల మొక్కలతో
బాంధవ్యం రమారమి ఎక్కువ

చేతి కత్తి మీటుతుంటే
చేమంతులు విచ్చుతయి ;
రాతి పువ్వు నవ్వితేనే
రాగోదయాలు కలుగుతయి

అతనికి అంతవరకూ
తనపూలంటే ఆప్యాయతే —,
పతనమైతే, పశ్చాత్తాపం
నిలువెల్ల విద్యుత్తులా పాకిపోతే,
కంట నీరెట్టుకొని కలవర పడతాడు
చంటి బిడ్డలా యేడుస్తూ
మంటిమీదే వొరిగి పోతాడు

అతడు రసద్రష్ట — రాగరాజితుడు
అతడు కళాస్రష్ట — సౌందర్యోపాసకుడు

రకరకాల పువ్వుల నవ్వుల
జల్లులు చల్లించుకున్న వృద్ధుడు
తికమకలు పడి రసజ్ఞతను
వికావికలైన హృదయపీఠానికి
హత్తుకున్న ప్రబుద్ధుడు
అప్పుడు - ...
తటాక ప్రాంత కేళీ వనాంతరాలలో
దరస్మిత వదనారవిందుడై
విహారం చేసాడు - విలాసంగా - వినోదంగా

చిటారు కొమ్మపై రసాల కోమల
కిసలయా స్వాదన కషాయ కంఠ
కలకంఠ కామినీ యుగళ కుహూకార
కోలాహల స్వనాలు విన్నాడు మనోజ్ఞంగా

నందనోద్యాన నవ ప్రసూన పారిజాత
కుసుమోత్థ పరాగ పరిమళమ్ములో
విశ్రమించాడు —

మందాకినీ సైకత స్థలాలపై
వారిజాక్షుల వక్షోజ హేమకుంభముల యొర
పిడిలో
నులి వెచ్చని కౌగిళింతల కమనీయత్వాన్ని
చవి చూచాడు —

పని మాలే విరిబాల బారసాలలు జేసి
కలుపుకున్నాడు అనుబంధం
వనమాలి జీవితానుభవాల సంపుటి
ఇలా ఒక రసవత్తర నవ్యప్రబంధం

ఇప్పుడు బ్రతుకులో కుక్క—
గొడుగులు లేచినయి.
తప్పటడుగులు వేయుమంటూ,
తలక్రిందకు దించ మంటూ,
తప్పులన్నీ మాటిమాటికి
తలపుకొస్తున్నయి
విలాపిస్తున్నయి

స్త్రీలు నేర్పిన శృంగార
కేళీ విలాసాలలో
శీధు రసాస్వాదనం చేసాడు.
పూలు నేర్పుతున్న
జోల పాటలలో
ఆధ్యాత్మికానందాన్ని
అందుకుంటున్నాడు.

నిత్యం, రాలిపోయే పువ్వుల్ని
పలకరిస్తాడు.
సత్యం, ప్రత్యక్షమవుతూనే
నమస్కరిస్తాడు - శివమ్ - సుందరమ్‌తో
తృప్తిపడతాడు.
విచ్చుతూ - విచ్చుతూన్న
ముకుళాలను
ముద్దిడి — 'సౌశీల్యంగా వుండుడు' — అంటాడు
"నచ్చుతూ - నవ్వుతూ
పిలిచే - పిలిపించుకునే
పిచ్చివాళ్ళను పరామర్శించకుండుడు-" అంటాడు.

వినినట్లు నటించిన
విరికన్నెల వదనాలు
వాడి - రాలిపోయి నిర్జీవమవుతున్నాయి
కని, విని, యెరుగని, కలకాంతునితో
వలపుపాటలు అంతమవుతున్నాయి.

వనమాలి హితోపదేశం
నిర్వీర్యమైంది రాను - రాను
తనువు కిరాయికిచ్చి
క్షణిక సుఖం జోరయింది పోను - పోను

అందుకే! తల నెరసిన తోటమాలి
కళ తరిగిన పూబాసలు వినగరాడు.
ఇందుకే! స్త్రీలన్నను - పూలన్నను
చిరాకెత్తి జీర్ణ పర్ణశాల నీలినీడల్లోకి
దొరబడి పోతాడు

(సశేషము)

# సాధ్వి సులోచన

శ్రీమతి ద్విభాష్యం కామేశ్వరి



అది ఎంతో మనోహరమైన సాయం సమయం. ప్రభాకరుడు ఇంకెంతో కాలము రక్కసుల బాధ యుండనుగదాయని మోదము త్వర త్వరగా తన నిలయము జేరుచుండెను. సాంధ్య కిరణములు బంగరు కాంతులీనుచు లంకా పట్టణములోని సౌధములను వింతగా ప్రకాశింప జేయుచుండెను. ఇంక స్వేచ్ఛ యబ్బుచున్నది గదాయని వాయుదేవుడు మలయపవనుండని గంధవహుండని తన పేరు సార్థకము కాగా పట్టణ మెల్లెడల స్వేచ్ఛగా విహరించు చుండెను. నగరమున కావల ఇంద్రజిత్తునకు లక్ష్మణునకు ఘోర సంకుల సమరము జరుగుచుండెను. ఆ రోజు మాయా యుద్ధములో తన నేర్పు నంతయు జూపి లక్ష్మణునెట్లైనను బడగొట్టవలెనని ఇంద్రజిత్తు పోరొనర్చు చుండెను. సౌమిత్రికూడ సమయముచూచి మేఘనాధుని శిరము దెగవ్రేయ జూచుచుండెను.

ఇట్టి సమయమున లంకా పట్టణములో నొక మణిమయ సౌధమున నొక రమణీమణి చెలులతో తూగుటూయెల లూగుచు వినోదముల దేలుచుండెను. ఆమె చక్కని చుక్క. మోము పూర్ణచంద్రుని ధిక్కరించు నట్లుండెను ఆమె మహా సాధ్వీమణి. ధీర వీరపత్ని. ఆ తరుణి ఇంద్రజిత్తు భార్య. ఆమెయే సులోచన. అహికుల రాజైన వాసుకి కుమార్తె. ఒక వంక భర్తను సమర భూమికంపి సాక్షాత్ శ్రీమన్నారయణ మూర్తియైన రామచంద్రునితో రణమున జయించలేడని తెలిసికూడ జయశ్రీ నొందునని దీవించి నాధుని రణరంగమున కంపి పతియే తన సర్వస్వమని భావించుచు సఖులకు పాతివ్రత్య ధర్మములు బోధించుచు పతి కష్టసుఖములలో సమపాలు పంచుకొని సహధర్మిణియై పతి శుశ్రూష జేయుటయే పరమ ధర్మమని. పతిబాసిన సతి బ్రతుకేటి బ్రతుకు, పతి ఏడ నున్నను అతని ననుసరించుటయే సాధ్వీమణుల లక్షణంబని పెక్కు విధంబుల సంభాషించుచు ప్రొద్దుపుచ్చు నవసరంబున నా సతీమణి ఎదుట హఠాత్తుగ నొక ఖండిత హస్తము గనుపించెను.

దానిగాంచి యా మానినీమణి కలవరపాటుతో లేచి యా హస్తము తన ప్రాణనాధునిదిగా నెరింగి దుఃఖము నాపజాలక గ్రక్కున మూర్ఛనొందెను. అంత గొంత వడికి చెలులు జేయు సపర్యలకు తెలివివచ్చి

మన్యువతో యీ హస్తము నక్కున జేర్చుకొని దుఃఖించుచు! "అరి భీకర హస్త మా ఇంద్రుని జయించిన మేటిపరాక్రమశాలి కీయవస్థ ఎట్లు ఘటిల్లినది ! నా స్వామిని విడచి నీ విందేల వచ్చితివి. ఏమి జరిగినదో వివరముగా నెరిగింపుమా" యని కన్నీరు మున్నీరుగా ప్రవహింప, నా సతీమణి యడుగగానే రక్త సిక్తమగు నా ఖండిత హస్త మీ విధముగా వ్రాయ దొడంగెను– సాధ్వీమణీ, విధిని దప్పింపనేరి వశము. నేను యుద్ధములో సౌమిత్రిచే వీర మరణము నొందితిని, నీ రాకకెదురుచూచుచున్నాను. నీవు దుఃఖము నొందవలదన్న వాక్యంబుల నాయమచూచి గొంతవడి చింతిలి ధైర్యము చెంది పతితో సహగమనము జేయ నిశ్చయించుకొని ఈ సంగతి అత్త మామలకు దెలియబరచెను. మండోదరి కన్నీరు కాల్వలై ప్రవహింప నేడ్వ దొడంగెను. "బిడ్డా సులోచనా ! ముద్దుల పట్టియే బోయెనని ఏడ్చుచుండ నీవుకూడ మమ్ములను వదలిపోయెదవా" అని ఎలుగెత్తి రోదనము చేసెను. దశముఖుండంత కోడలినిచూచి పుత్రశోకంబుతో, "అమ్మా దుఃఖింపకుము. మదీయ పుత్రుని జంపిన దుర్మార్గుని యీ నరాధముని రేపీపాటికి సమూలముగ సర్వనాశనముజేసి వైచెదను. అప్పటికిగాని నా క్రోధము శాంతింపదు. నీవు చిన్నదానవు. నీ నిశ్చయము మార్చుకొమ్మ" నగా నా సాధ్వీలలామ రెండు చేతులు జోడించి, "మామా, ఎందుకీ, కక్షలు? రాముడు శ్రీ విష్ణువు. అతని నెవరు జయింపగలరు. చేసిన తప్పు దిద్దుకొనక ఎందులకీ లేనిపోని అడియాస. ఆ మహాత్ముని నీవు జంపుట కల్ల నీ సుతుని పరాక్రమంబు నీ వెరుంగనిదే! సతికి పతితోడిదే లోకంబని నీ వెరుంగవే. నేనింకొక నిముసమైనను నా జీవితేశుని చూడనిదే నిలువజాలను. నీ వెట్టిదైనను రాముని యొద్ద కెవరినైన బంపి నా నాథుని శిరము దెప్పింపుము. నిను వేడుకొనుచున్నాను. మామా" యని ప్రార్థింప నాతని మనసిసుమంతయైనను దిరుగదయ్యె. "నేనా రాముని వద్దకు యరుగుట! పిరికి పందనై యుద్ధము జేసి పగతీర్చుకొనక, యీ నరాధము నాశ్రయించుటా! కల్ల. అది ఎప్పటికి జరుగదు. ఎట్లో ఓపిక పట్టి రేపటివరకు నాగుము. సర్వనాశము జేసి ఆ రాముని పట్టి వధించి నీ నాథుని శిరస్సు దెచ్చి ఇచ్చెద" ననగా నాయమ సక్రోధయై "ఛీ, నిర్దయా, ఎంత కఠినగుండె నీది. ఒక అబల అనాథ కోర్కె దీర్చలేక పోతివి. నా అభిమానము జంపుకొని సిగ్గులేక ఇంతసేపటి నుండి నిన్ను వేడుకొనుటకంటె ఆర్తత్రాణ పరాయణుండగు నా రామచంద్రుని వేడినచో నాథుని శిరస్సీయకుండునా? శరణన్న శత్రువునైన చేరదీయువాడు ఆ రాముని కడకే బోయి యడిగెదగాక" యని చివ్వున

లేచి పోవుచుండ, "ఆగుమాగుము సులోచనా! రేపటి వరకు నాగుము. నా పలుకు నిల్పుమని" రావణుడు చెప్పుచున్నను నా సాధ్వి నా నిశ్చయమునకు తిరుగులేదని మారు పలుకక నామె దైన్యముతో ఖిన్న వదనయై పతి హస్తమును పల్లకియందు బెట్టించుకొని నా రాముని కడకుబోయి శరణు శరణని శ్రీరామచంద్రుని చరణంబుల వ్రాలె. అప్పుడు రాముడు "అమ్మా నీ కేమియు భయములేదు. నీ కేమి కావలెను. సర్వము విశదముగా జెప్పు"మన నాయమ "రామచంద్రా సర్వాంతర్యామివైన నీ కెరుక లేనిదేమున్నది. సతికి పతియేగదా దైవంబు. మన్నాథుని శిరము నిప్పింపు'మన సౌమిత్రి ఎదురుగానున్నచో నమ్మహాసాధ్వి శపించునేమోయని, యామె నింద్రజిత్తుభార్య సులోచనగా నెరింగి, చాటుగా నుండునట్లు లక్ష్మణునకు సైగ చేసి హనుమస్సుగ్రీవులు ముందునిలిచి చేతులు జోడించి, "అమ్మా, ఇంతలోనే ముందుగా మీకీ కబురెట్లు తెలిసిన"దన నామె బల్లకిలోని తన నాథుని హస్తము దీసి యొడిలో నుంచుకొని యా హస్తము జెప్పెనని జెప్పి శోకాకులిత మానసురాలయ్యెను.

అప్పుడక్కడనున్న వారందరు హస్తము చెప్పుట ఏమి! ఎక్కడా కనలేదు వినలేదని వెరగుపడుచుండ హనుమస్సుగ్రీవులు సందేహము బాపుకొన అడిగినచో నా మహాసాధ్వి ఏమేని శపించునేమోయని భయము జెందుచు ధైర్యముచేసి యామెకు బ్రణమిల్లి, 'తల్లీ, మా మనవిని విని మా సందేహము బాపుమని, హస్తము జెప్పినదన నమ్మశక్యముగాకున్న''దన నా పతివ్రతా తిలకంబు నెమ్మనంబున నాథునిస్మరియించి, "నేను నిక్కముగ పతిభక్తిగలదాన నైతినేని, నా మనోనాథునిదప్ప అన్యమెరుగనిదాన నైతినేని, ఓ ప్రాణనాథుని పవిత్ర హస్తమా ఇదివరలో జెప్పినరీతి మరల నొకపరి జెప్పవే"యన నా హస్తమతి విచిత్రంబుగ చూపరులకు భయసంభ్రమాశ్చర్యంబులుగొలుప సట రక్తాక్షరంబుల, "విధినిదప్పింప నెంతటిహరికైన నశక్యంబు. నేనుయుద్ధములో వీరమరణము నొందితిని. బుణ్యలోకంబుల బొందియున్నాను. నీరాకకెదురు చూచుచున్నాను. నీవు నాకై దుఃఖింపవల''దనివ్రాసి ఎప్పటియట్ల యథాస్థానము నొందెను. ఇదియంతయు నక్కడి వారందరుగాంచి భయాశ్చర్యంబులనొంది యాసాధ్వీ తిలకంబును పెక్కువిధంబుల నుతించి జోహారొనర్చిరి. సురలు సుమవర్షము గురిపించిరి. ఎవరినోటవిన్నను ఎక్కడచూచినను సతిసులోచనమాటయే. శ్రీరామచంద్రుడామె పతిభక్తికలరి ఇంద్రజిత్తుశిరము దెప్పించి నా సతీలలామకొసంగి ప్రణామముచేసెను. అంతట సులోచన రామునివద్ద సెలవునొంది పతి శిరము బంగరు పల్యంకికలో బెట్టించి

పురముజేరెను. సతీసులోచన సహగమనము సంగతి పట్టణమెల్లెడల ప్రాకిపోయెను. ఆమె రాముని వద్దకుపోవుట, పతి శిరము దెచ్చుట, ఖండిత హస్తము చెప్పుట మున్నగు నామె పాతివ్రత్యమహిమ జనులు వేనోళ్ల గొనియాడ దొడంగిరి. ఇక నామె నిశ్చయమునకు మార్పులేదని దశగ్రీవుడు మంచి గంధము చందనదారువులతో చితి సిద్ధము జేయించి సహగమనమున కన్నియు సిద్ధపరచి మంగళతూర్యనాదములతో సతీసులోచన చితిజేర, కుమారుడు పోవుటయేగాక కోడలుగూడ పోవుచుండ మొండివాడై కన్నులార జూచుచుండెను. పురజనులందరు నొక మహోత్సవమునకు గుమిగూడినట్లు చూచుచుండిరి. అంత నమ్మహాసాధ్వి అత్తమామలకు నమస్కరించి చితిజుట్టు భక్తితో ముమ్మారు ప్రదక్షిణ మొనరించి చిరునవ్వుతో భర్తనుజేర నరుగు నుత్సాహముతో నాథుని శిరస్సుతో జితియందుబడి బుణ్యాలోకమునందున్న భర్తను జూడ బోయెను. అంత నింగినుండి దేవతలు కుసుమవర్షము గురిపించిరి. సులోచన రాక్షసపత్నియే కాదు రాక్షసాంగన మాత్రము కాదు ఆమె వాసుకి కుమార్తె, నాగకన్య. దిక్పాలకులను జయించి రావణాసురుడు వారిచేత తనకు ఊడిగం చేయించుకొన్నాడు. అన్ని లోకాలను జయించే సమయాన రావణుడు తన మీదికి రాకుండా ఉండేందుకు వాసుకి రావణ కుమారుడైన ఇంద్రజిత్తుకు తన కుమార్తె నిచ్చి బాంధవ్యం కలిపినాడు. అతనిని మించిన పరాక్రమశాలి బలవంతుడు తనకు మాత్రము అల్లుడుగా దొరకవద్దా అనుకొన్నాడు. సాధ్విసులోచన, సీత, సావిత్రి, దమయంతులతో సాటియైన మహాపతివ్రత.

# సన్మానము!

శ్రీమతి దాసరి శారద B. A.



ఉదయము ఎనిమిది గంటలయింది. కాఫీ సేవించ టానికని బయలుదేరాను. ఇంతలో ద్వారక తారాజువ్వలా దూసుకువచ్చాడు. వస్తూనే "నిజంగా నాకు చాల అవమానంగావుందోయ్" అన్నాడు.

నేను ఆశ్చర్యపోయాను. రావటమే అవమాన మంటున్నాడేమిటా అని, "అసలు జరిగిన సంగతేమిటో చెప్పకుండానే అవమానమంటా వేమిటోయ్!" అన్నాను ద్వారకతో.

"ఇంకా ఏమి చెప్పేది? నాకంటే వెనక వ్రాయటము మొదలు పెట్టినవారంతా సత్కారాలు చేయించుకుంటూ సన్మానాలందుకొంటుంటే నా పేరు తలచినవాడే లేకపోయె. నాతోడి వాళ్ళంతా తమ పేర్లను పేపర్లో చూసుకొని మురిసిపోతుంటే అనామకునివలె నేను ఎవరిదృష్టిలోనూ పడకుండా వుండటమాయె. ఇంతకంటే యింకా అవమానమేమి కావాలి!" అన్నాడు ద్వారక రోజుకుంటూ.

"ఓస్! ఇంతేకదా! నేనుయింకా ఏమి కొంప మునిగి పోయిందో అనుకున్నాను. ఇంత మాత్రానికి నీవు అంతగా బాధ పడవలసిన అవసరమేమిటోయ్!" అన్నాను ద్వారకతో.

"నీ కట్లాగే వుంటుంది లేవోయ్. నిన్న గాక మొన్న గీకటం మొదలు పెట్టిన వెంకటేశంగూడ సన్మానం చేయించుకున్నాడు. ఐదు సంవత్సరాలనుండి అమోఘంగా సారస్వత సేవచేస్తున్న నన్ను తలచే సాధుడు లేక పోయె. మరి నేను పైకిరావాలంటే ఎలావస్తాను?" అన్నాడు ద్వారక తన మనస్సులోని అక్కసునంతా వెళ్ళగక్కుతూ. "అయితే యింతకీ నీకూ సన్మానం కావాలంటావు - అంతేనా?" అన్నాను నేను.

"అవును! సన్మానమంటే నా సంతోషానికే కాదోయ్. నా పేరు నలుగురికీ తెలియాలంటే ఏదో ఒక సభలోనైనా సన్మానం జరగాలా? పదిమంది నా పేరు చెప్పుకోవాలంటే నా పేరు పేపర్లోనయినా పడాలా? ఇంతా జరగాలంటే నీలాంటివాళ్ళు నలుగురు నడుము కట్టుకోకపోతే ఎలా సాధ్యమవుతుంది చెప్పు" అన్నాడు ద్వారక.

"అదెంత భాగ్యమోయ్. రేపీపాటికి నీకూ సన్మానం జరిపిస్తాను. దీనికింత హైరానా పడవలసిన అవసరమేమిటి?" అన్నాను నేను ద్వారకను తృప్తి పరచాలనే ఉద్దేశ్యముతో.

"ఆ! అది అంత తేలికగా అయ్యేపనా?" అన్నాడు ద్వారక కొంచెము ఆశతోనే.

"మాటలతో కాకపోతే చేతులతో అవుతుందిగా! మనము తలచుకుంటే కాని పనేమిటి?" అన్నాను- నేను అదేదో తేలిక అన్నట్లు.

"చూడు రామం! నీవుగనుక యీపనికి నడుము కట్టుకున్నావా నీ ఋణము యీ జన్మలో మరచి పోను. నేను పైకివచ్చాక నీకెంతైనా సహాయము చేస్తాను." అన్నాడు ద్వారక ఏవో గాలిలో మేడలు కట్టుకుంటూ.

"నీ పేరు అందరికీ తెలిసేటట్లు చేసే భారము నాకు వదిలేయ్. ఆ చింత నీకేమీ వద్దుభాయ్. రేపు వచ్చే ఆదివారమునాడు నీకు ఘనసన్మానము జరుగబోతుంది సరేనా!" అన్నాను ద్వారకతో

"అంత తొందరలో జరగటము సంభవమంటావా? మరి సభజరగాలంటే డబ్బూ అదీ కావాలాయె" అన్నాడు ద్వారక సందేహంతో.

"డబ్బు సంగతీ ఆలోచించాల్సిందే ననుకో. అయినా మీనాన్ననడిగి కొద్దో గొప్పోపట్టుకొస్తే మిగతా డబ్బు మనము ఎలాగో సర్దుకోవచ్చు" అన్నాను నేను

"అది కాదోయ్‌రామం! మా నాన్నమాత్రము

యిలాగని తెలిస్తే అసలు సభజరగటమే కష్టమవుతుంది. అలాంటప్పుడు ఆయన డబ్బిస్తాడనేది కలలోమాట” అన్నాడు ద్వారక.

“మరేమిచేద్దాము ? సరే నేను ఆలోచిస్తాను. నీవు వెళ్ళి నిశ్చింతగావుండు” అన్నాను నేను ఆలోచిస్తూ.

“ఈ దెబ్బతో వెంకటేశం గర్వమణగాలి. తానే ఏదో గొప్పరచయితనని, తనకే ఘనసన్మానము జరిగిందని గర్విస్తున్నాడు. హుం ! ద్వారకంటే ఏమిటనుకున్నాడో ?” అన్నాడు నామిత్రుడయిన ద్వారక

“వెంకటేశంకి జరిగిన సన్మానం ఒకఎత్తూ. నీకు జరగబోయే సన్మానం ఒక ఎత్తూ. ద్వారకానాధుని పేరు దేశమంతటా మారుమ్రోగిపోతుంది రేపటి సన్మానంతో” అన్నాను నేను.

“అయితే నేను వెళ్ళివస్తానోయ్. రేపు కలుసుకుందాము.” అని వెళ్ళిపోయాడు ద్వారక.

“అమ్మయ్య ! ” అని నేను విశ్రాంతిగా గాలి పీల్చుకొని కాఫీ హోటలువైపు వెళ్ళాను.

* * *

ద్వారకానాధుడూ నేనూ చిన్నప్పటినుండీ స్నేహితులము . ద్వారకకి యిప్పుడు యిరువదిరెండేండ్లుంటాయి. ద్వారక తండ్రి కృష్ణయ్యగారు - కో ఆపరేటివ్ సబ్ రిజిష్ట్రారు. కొంచెము 'సీరియస్'గా వుంటాడు. ద్వారకకి తండ్రంటే తగనిభయం. ద్వారక స్కూలుఫైనల్ తో చదువుకి స్వస్తిచెప్పాడు. చిన్నతనమునుండీ పత్రికలు చదువుతూవుండేవాడు. అందువలన అతనికి పత్రికలన్నా పత్రికారచయితలన్నా అభిమానము. తానుగూడ రచయిత కావాలని ప్రయత్నించాడు. మొదట్లో చిన్నచిన్న ప్రశ్నలు పత్రికలకి పంపుతూవుండేవాడు. పత్రికలో తన పేరుచూచుకొని మురిసిపోయేవాడు. ఎలాగయితేనేం తనపేరు అందరికీ తెలియాలని విశ్వప్రయత్నంచేశాడు. వచ్చిన ప్రతి సినిమానీ మొదటి రోజునేచూచి తన అమూల్యాభిప్రాయాన్ని వ్రాసి పత్రికలకి పంపేవాడు ద్వారక. ఈ విధముగా ద్వారక మెల్లమెల్లగా మెట్లెక్కుతూ కథలు వ్రాయటమువరకు వచ్చాడు. ఇప్పుడు ద్వారక దాదాపు పదికథలు వ్రాసివుంటాడు. ఇంకా ఏవో చిన్నచిన్న గేయాలనీ, పద్యాలనీ వ్రాశాడు. ద్వారక తానువ్రాసినవన్నీ సాయంకాలముపూట మా యింటికివచ్చి నాకు వినిపిస్తుండేవాడు.

ద్వారకంటే నాకు చాల అభిమానం. మాచిన్ననాటి స్నేహమే అందుకు కారణం. ఈ రోజు ద్వారక నా దగ్గరకు వచ్చి చెప్పిన సంగతులన్నీ విన్నమీదట మా ద్వారకకుకూడా ఏదైనా సన్మానసభ ఏర్పాటు చేయాలనిపించింది. పాపం ! వాడి ముచ్చటగూడా తీర్చాలిగా! అందుకని వాడికి ఆ విషయముచెప్పి తృప్తిపరచి పంపించాను. కాని తరువాత నాకు పెద్ద ఆలోచన పట్టుకున్నది. సన్మానసభ ఏర్పాటుచేయాలంటే ఎంతలేదన్నా రెండు వందల రూపాయలు కావాలాయె. ఈ రోజు నా దగ్గర పట్టుమని పదిరూపాయలు లేవు. ఏమి చేయాలి? ఆలోచించాను. రాత్రంతా నిద్రలేదు - ఆలోచనలతో ప్రొద్దున్నే ఒక నిశ్చయానికి వచ్చాను. ద్వారకకీ నాకూ ఆప్తమిత్రులయిదారుగురున్నారు. వారిని కలుసుకొని ద్వారక సన్మానం సంగతి చెప్పాను. వాళ్లుకూడ మాలాగ కుర్రవాళ్ళే. ఒక్కడూ సంపాదించుకుంటున్నవాడులేడు కొద్దో గొప్పో ఆర్థికంగా తోడ్పడటానికయినా .. మేమంతా ఆలోచించి ఎలాగయినాసరే ద్వారకకి సన్మానం జరిపించితీరాలనే నిశ్చయానికి వచ్చాము.

మరి ద్వారకకి ఏదయినా బహుమానము యివ్వాలిగా ?

ఆ రోజు ఏమివ్వాలి ? డబ్బులేదు. ఎలాగా?

ఈ విషయము ఆలోచిస్తుంటే మా ధర్మారావు ఒక సలహాచెప్పాడు.

“చూడు రామం ! మా అన్నయ్య మొన్న ఆటల

పోటీలో గెల్చినందుకు పెద్ద వెండికప్పు ఒకటి బహుమానంగా యిచ్చారు. దానిని నేను తీసుకొస్తాను. క్రొత్తకప్పు, దానిని ఆ రోజు సభలో మన ద్వారకకి బహుమానంగా యిద్దాము-నలుగురిలో చాలా బాగుంటుంది” అన్నాడు ధర్మారావు.

“భేష్ ! నీ సలహా బాగుంది. మరి యింకా ఏమైనా యివ్వాలా” అన్నాను నేను.

“వట్టికప్పుయిచ్చి ఊరుకుంటే ఏమిబాగుంటుందోయ్. మా యింట్లో పండితశాలువలున్నాయి. వాటిలో క్రొత్త శాలువనిచూచి పట్టుకొస్తాను. ద్వారకకి శాలువనుగూడ బహూకరిద్దాము” అన్నాడు సుబ్రహ్మణ్యం. వాళ్ళ నాన్న పండితుడులెండి. అందుచేత శాలువలకేమీ కొఱతలేదు.

“సరే. ద్వారకకిచ్చే బహుమతుల సంగతి తీరిపోయింది. పోతే ‘పార్టీ’ సంగతి ఆలోచించాలి” అన్నాను నేను.

ఇంతలో ద్వారక వచ్చాడు. “టీపార్టీదేముందోయ్. ‘ఆనందావిలాస్’లో ఆర్డరిద్దాము” అన్నాడు.

“మరి డబ్బు! సంగతి” అన్నాడు మా మిత్రబృందంలో మూడవవాడయిన కృష్ణమూర్తి.

“డబ్బుసంగతి దేవుడెరుగు. ప్రస్తుతానికి పని జరగాలిగా. ముందు ఆర్డరిచ్చి డబ్బు తర్వాత యిస్తామని చెబుదాము. ఆ హోటలు మేనేజరు నాకు బాగా తెలుసులే” అన్నాడు ద్వారక.

“ఇంకేం! బాగుంది, అయితే నేను ‘ముకుందా’ ప్రెస్‌కివెళ్ళి కరపత్రాలు వేయిస్తాను” అన్నాను నేను.

అందరూ చాలా హుషారుగా వున్నారు. ద్వారక ఆనందానికి మేరలేదు. మా మిత్రబృందానికి ఆ నాలుగురోజులూ నిద్రలేదు. ఆదివారమెప్పుడు వస్తుందా అని కాచుకొని కూర్చున్నాము.

కరపత్రాలు అచ్చయి వచ్చాయి. మిత్రులందరూ అందరికీ కరపత్రాలు పంచిపెట్టి బాగా ప్రచారం చేశారు. ఇంతలో ఆదివారము రానేవచ్చింది. మా ఊరి కౌన్సిలర్‌గారిని అధ్యక్షులుగా ఆహ్వానించాము.

టీపార్టీ బ్రహ్మాండంగా జరిగింది. అధ్యక్షుడు తొలిపలుకులు పలుకుతూ “ద్వారకానాథుడు యింత చిన్నవయస్సులోనే యింత పెద్ద సన్మానం చేయించుకుంటున్నాడంటే ఆయన ఎంత గొప్పవాడో మనకు స్పష్టమవుతున్నది. నేను ద్వారకగారి రచనలు చాలా చదివాను. ఆయన రచనలలో ఒక ప్రత్యేకత వున్నది ... ... ” అని అన్నారు.

తరువాత ద్వారక మాట్లాడుతూ “నాకు యీ సన్మానం చేస్తున్నందుకు మీకు కృతజ్ఞత తెలుపుకుంటున్నాను. నేను యింత పైకి రాగలిగానంటే అందుకు మీ ఆదరాభిమానాలే కారణం ... ” అని ఒక పావుగంటసేపు మాట్లాడాడు.

తరువాత ద్వారకకి బహుమతులు అందజేశాము. ఇంతలో సుబ్రహ్మణ్యము ఒక ఫొటోగ్రాఫరుతో వచ్చాడు. ద్వారకని ఫోటో తీశాడు. అందరము ద్వారకని అభినందించాము. రెండు రోజులు గడచిపోయినయ్.

నేను బాగా అలసిపోవటముచేత ఆ రెండు రోజులు బయటకు వెళ్ళలేదు. మూడవరోజు ప్రొద్దున్నే లేచి కాఫీ త్రాగి మొన్నటి సభావిశేషాలు పత్రికా విలేఖరి దగ్గరకివెళ్ళి ఒక నమస్కారముపెట్టి యిచ్చాను. ఆయనతో కొంచెము మంచిగా మాట్లాడి మా ద్వారక పేరు ఎలాగయినా సరే పేపర్లోపడుతుందని గట్టిపరచుకొనివచ్చాను.

తరువాత ద్వారకని కలుసుకుందామని వాళ్ళ యింటి దగ్గఱకు వెళ్ళాను. వాకిలి దగ్గరకు వెళ్ళానో లేదో ద్వారక యింట్లో ఏదో తుఫాను బయలుదేరినట్లు నాకనిపించింది. నేను అక్కడే నిలబడి ఆలకించసాగాను.

ఒకాయన యిలా అంటున్నాడు: "ఏదో మీ ముఖముచూచి అప్పిచ్చాముగాని, మీ సుపుత్రరత్నాన్ని చూచిగాదు. మొన్న హోటలుకివచ్చి ఎంతో తియ్యగా కబుర్లుచెప్పి డెబ్భైరూపాయలకు ఆర్డరు యిచ్చాడు. డబ్బు మరునాడిస్తానని చెప్పాడు. ఇప్పుడేమీ మాట్లాడడాయె" అంటున్నాడు.

నా కర్థమయింది ఆయనెవరో. ఆయన కాఫీహోటలు మేనేజరు. నాకు గుండెలో రాయిపడింది. కొంచెము వంగి లోపలికి చూచాను. ద్వారక పాపం దిక్కు ముఖముతో చూస్తున్నాడు. వాళ్ళ నాన్న అంటున్నాడు: "ఏరా! మాట్లాడవేం? ఇంత అప్పు ఎందుకుచేశావు? నీ తాతగా డెవరిస్తాడనుకున్నావు? విందులుచేసేటంతటివాడవయ్యావన్నమాట! మర్యాదగా తీర్చావోసరి – లేకపోతే యీ యింట్లో వుండటానికి వీలులేదు. జాగ్రత్త. ఎలా తీరుస్తావో తీర్చుకో" అని గర్జించాడు. ఇంతలో ధర్మారావు పరుగెత్తుకుంటూ వచ్చాడు.

వాకిట్లో నన్నుచూచి "ద్వారక లోపలున్నాడా" అని అడిగాడు.

"ఏం? ఏమిటి సంగతి" అన్నాను.

"ఇంకా సంగతేమిటి! నా వళ్లు పెట్టిపోతేను. మా అన్నయ్య కప్పుకోసం చూచుకొని లేకపోయేటప్పటికి నా వీపుమీద వడ్డించి మర్యాదగా ఆ కప్పు తీసుకురమ్మన్నాడురా. ఏం చేదాము చెప్పు" అన్నాడు.

"సరేలే. గొడవచేయకు. నేను మెల్లగా తెప్పించి యిస్తాను. అసలే వాళ్ళ నాన్న అరుస్తున్నాడు. పైగా నీవుగూడ యిప్పుడే వెళ్తే యింక ద్వారకని చావగొడ్తాడు" అన్నాను.

"సాయంకాలానికి తప్పకుండా యివ్వాలి. లేకపోతే మా అన్నయ్య బ్రతకనివ్వడు" అన్నాడు ధర్మారావు.

"అలాగేలే" అని అతనిని సాగనంపాను.

ఇంతలో హోటలు మేనేజరు వెళ్ళిపోయాడు నేను మెల్లగా లోపలికి వెళ్ళాను, ద్వారక తండ్రి కృష్ణయ్యగారు నన్నుచూచి "ఏమోయ్ రామం! ఏమిటి సంగతి? మా ద్వారకకి సన్మానం జరిపించారటగా! భలేవాడవయ్యా! ఇలాంటి సన్మానం యింతవరకు ఎక్కడా జరగలేదు. అప్పులవాళ్ళు వెంటబడుతున్నారు. వాడొక బ్రాతగాడూనూ, మీరు సన్మాన సంఘాధ్యక్షులూనా? ఇదేమి సన్మానమయ్యా! వాడికి తెలియకపోతేపోనీ నీవైనా చెప్పగూడదా? ఇదేనా మీరుచేయవలసిన పని" అని నన్నుగూడా చీవాట్లు పెట్టాడు. నేను ఏమీ మాట్లాడలేదు. ఇంతలో మా యింటిదగ్గర నుండి కబురువచ్చింది – 'ముకుందాప్రెస్' యజమాని వచ్చాడని. నేను వెళ్ళిపోయాను. అందరికీ సర్ది చెప్పేటప్పటికి నా తలప్రాణం తోకకివచ్చింది. ఏమయితేనేం? మా ద్వారక సన్మానము సంగతి పేపర్లోపడింది!

# ఇడ్లీ, ఉపమా, పెసరట్లు ఆరోగ్యదాయకముగ జేసికొనుట

## 1. ఇడ్డెనలు

తిన్నగా తయారుచేస్తే యిడ్డెనలు ఎక్కువ అజీర్ణముచేయవు. కష్టపడి పని చేసేవాళ్లు ప్రొద్దునే 1, 2 యిడ్డెనలు తిని పనిలోకి పోతే బలముగానూ ఉంటుంది. అయితే కొద్ది మార్పులు చేయాలి. ఈ విషయాలు గమనించి మార్పులు చేయటానికిగూడా అట్టే యిబ్బందులు రావలసిన పనిలేదు.

మినుములు 6 గంటలు నాననిచ్చి ఒక బుట్టలో వడవేసి ఉంచితే తరువాత 12 గంటలలో మొలకలు వస్తవి. ఆ మొలకలు వచ్చిన మినుములు మెత్తగా వడియాల పిండివలె రుబ్బవలెను. అందులో యిప్పటివలెనే మరబియ్యపు పిండిగాని, ఉప్పుడు బియ్యపు పిండిగాని కలుపరాదు. కర్రతిరుగలిలో విసరిన బియ్యపుపిండిగాని, పెద్ద ఫ్యాక్టరీలలో దొరకే షల్లరుక్రింద తయారుచేసిన, అనగా ఊకమాత్రము తీసి వేసిన బియ్యపు పిండిగాని, మినపపిండికి 3 రెట్లు కలపవలెను.

మొత్తము పిండికి తుల్యముగా కాబేజీ సన్నగా తరిగిన పొట్టుగాని, సన్నగా తరిగిన తోటకూరగాని, బచ్చలికూరగాని, తురిమిన బూడిద గుమ్మడికాయ ముక్కలు గాని, సొరకాయగాని, బీర, పొట్లకాయ ముక్కలుగాని చేర్చి ఆవిరిమీద వండితే చాలా రుచిగా నుంటుంది.

దానిలో కొంచెము నెయ్యి చేర్చి యిప్పటివలెనే యేదన్నా పచ్చడి చేర్చుకొని తినవచ్చును. దీనివలన యిప్పటివలె మలబద్ధకరోగము రాకుండా పోతుంది. సేంద్రియలవణము లుండుటవలనను, సగ భాగము కూరగాయ లుండుటవలనను, దేహానికి భారము గాకుండా తేలికగా జీర్ణమూ అవుతుంది. మళ్ళీ మధ్యాహ్నము అన్నము వేళకు పనిచేసుకునేవారికి కరకర ఆకలి అవుతుంది. కాఫీహోటలులో తినేవారికిగూడా యీ పదార్థము మొద్దుయిడ్డెనలంత అపకారము చేయదు.

మరబియ్యపుపిండి చేర్చిన యిడ్డెనలు తినినప్పుడు బి. వైటమిన్ లోపిస్తుంది. ఉప్పుడుపిండి యిడ్డెనలు తినినప్పుడు అన్ని వైటమినులు నశించి ఉంటవి. మొలకలెత్తిన మినుముల పిండితో యిడ్డెనలు చేసినప్పుడు ఆపదార్థము తేలికగా జీర్ణము అవుతుంది.

బియ్యము నానబెట్టవలెను. కర్రతిరుగలి బియ్యముగాని, ఫ్యాక్టరీలలో దొరికే షల్లరు (Sheller) క్రింది బియ్యము అనగా కేవలము ఊక మాత్రమే తీసివేసిన బియ్యముగాని మంచిది. మరబియ్యము

వాడగూడదు. 6 గంటలు నానిన బియ్యమును బాగుగా రుబ్బవలెను. బియ్యమునకు 3 రెట్లు లేతబీరకాయ చెక్కు తీయని ముక్కలనుగూడా రుబ్బి ఆ పిండితో కలపవలెను. పెనము పొయ్యిమీదనుంచి ఒక కర్రకు ఒక గుడ్డచుట్టి, అది కొంచెము నేతిలో ముంచి పెనమును తుడువవలెను. కలిపియుంచిన పిండిని పలుచగా పెనము మీద పోసి, అట్లగరిటెతో తిరుగవేసి, బాగుగా కాలిన తరువాత తీసి తినవలెను. రుచి కావలసినవారు కొంచెము ఉప్పు, జీలకర్ర, అల్లము, పిండిలో కలుపుకొని కాల్చి తినవచ్చును. కొంచెము వెన్న పూసగాని, పేరిన నెయ్యిగాని, అట్టుతో చేర్చుకొని తినవచ్చును. పెనముమీద నున్న అట్టుపైన నెయ్యివేసి పేల్చుట బుద్ధి మాలినపని. అందువలన నేతిలోనున్న విటమినులును. పోషక ద్రవ్యములును నశించిపోవుటయేగాక, అట్టుగూడ జీర్ణమగుట కష్టమగును.

ఇట్లు తయారుచేసిన రొట్టెలో 1/4వంతు మాత్రమే బియ్యపుపిండి చేరియుండినందునను, 3 రెట్లు కూర చేరియుండినందునను, దేహమునకు కావలసిన సేంద్రియ లవణములన్నియు లభించుటయేగాక, బియ్యము నందలి పోషక ద్రవ్యములన్నియు వ్యర్థముగాకుండా మనకు చేకూరగలవు.

అటులనే సొరకాయ ముక్కలుగాని, పొట్ల, దోస, దొండ, కాబేజి, నూల్‌కోల్ బచ్చలియాకు, తోటకూర రుబ్బి బియ్యపుపిండి చేర్చి అట్లు (దోసెలు) వండుకొనవలెను. ఇవి చాల రుచికరముగా నుండుటయేగాక దేహమునకు కావలిసిన బలాన్నంతా చేకూర్చి, ఆరోగ్యదాయకములుగా నుంటవి.

నల్ల పెసలుగాని పచ్చ పెసలుగాని సంపాదించి అందు బెడ్డలు, రాళ్లు లేకుండా బాగుచేసి నీటిలో 6 గంటలు నానవేయవలెను. తరువాత నీటిని వంచివేసి, ఆ నానిన పెసలు చల్లనిచోట ఒక బుట్టలోగాని, తట్టలోగాని 1½, 2 అంగుళముల మందముగా నుంచవలెను. ఇట్లు 12 గంటలు నిలువయుంచినప్పుడు అందలి గింజలన్నియు మొలకలెత్తును. ఎక్కడనైనా కొన్ని గరిగింజలు మొలకలెత్తకున్నా యిబ్బంది లేదు.

మొలకలెత్తిన పెసలనుచూచి, అందుకు 3 రెట్లు బీర, పొట్ల, దొండ, దోస, తోటకూర, బచ్చలి, కాబేజి, కారెట్లు మొదలైన ఆకుకూరలుగాని, కాయగూరలుగాని తూచి చేర్చవలెను. పెసలూ, కూరలూ మెత్తగా రుబ్బి ఆ పిండిని అట్లు గాల్చవలెను.

పెనముమీద నేయి పోయవద్దు. ఒక పుడకకు గుడ్డచుట్టి అది నూనెలోగాని నేతిలోగాని కొద్దిగా ముంచి పెనముమీద

రాయవలెను. కాలుచున్న పెనముమీద యీ పిండినిపోసి తగినంత సెగమీద తిరుగా బోర్లాకాల్చి, దింపుకొని తినినయెడల యెంతో రుచిగా నుండవలెను. ఈ అట్టు చాలా మృదువుగా నుండవలెను. అట్టు కొంచెము గట్టిగా నుండగోరువారు పెసలలో $\frac{1}{2}$ గాని $\frac{1}{3}$ వంతు గాని తూకముగల నానిన దంపుడు బియ్యమునుచేర్చి రుబ్బవలెను. లేదా దంపుడు బియ్యపు మెత్తని పిండిని చేర్చవచ్చును. అట్టును నేతితోగాని, నూనెతోగాని వేల్చరాదు. అట్లు వేల్చిన అట్టు జీర్ణమగుట కష్టము. నెయ్యియును తెగకాగిపోవుటవలన అందలి పోషకశక్తి మనకు లభింపదు. ఆరోగ్యవంతులై, జీర్ణశక్తికలవారు కాలిన అట్టుమీద నెయ్యి వేసుకొని తినవచ్చును.

అట్లపిండిలో రుచికొరకు కొద్దిగా ఉప్పు, జీలకర్ర, అల్లమూ చేర్చుకొని అట్లు పోసుకొనవచ్చును.

'ప్రకృతి' సౌజన్యముతో



—X—

ఇండియా ఎగుమతులలో తేయాకు ముఖ్యమైనది. 1957లో ఇండియాలో 66 కోట్ల 60 లక్షల టన్నుల పౌనుల తేయాకు ఉత్పత్తికాగా అందులో 44 కోట్ల 70 లక్షల పౌనుల తేయాకు విదేశముల కెగుమతి అయినది. ద్వితీయ ప్రణాళికా కాలంలో తేయాకు ఎగుమతివల్ల ఏటా సగటున 127 కోట్ల రూపాయల ఆదాయం రాగలదని అంచనా వేయబడింది.

# కామాయని

మూలం :
శ్రీ జయశంకర ప్రసాదు

అనుసరణ :
శ్రీ కొంపెల్ల సోమేశ్వరశర్మ బి. ఏ.

(గత సంచిక తరువాయి)

ఒకదినమున వేటనుండి తిరిగివచ్చి స్వనివాసమైన గుహకు దూరమున నొకచో తన ధనుర్బాణములను క్రిందనుంచి తానుకూడ నేలపై కూరుచుండెను. గుహలో శ్రద్ధ, మనువుకొరకై నిరీక్షించుచుండెను. నిరవధికశ్రమచే నామె ముఖమండలమున స్వేద బిందువులు రాలుచుండెను. మాతృత్వభారవహనముచే నా పెవక్షోజములు వినమ్రములయ్యెను. గర్భవహనపీడననుభవించు, సర్వావిధముల నాకర్షణా విహీనమైన శ్రద్ధ నవలోకించి హతాశుడైనట్లులుకును పలుకును లేక నిలచినాడు. శ్రద్ధ మందహాసముల విరజిమ్మచు మధుర స్వరముతో నిట్లనెను. "ప్రియా! రోజంతయు నీ వెంట తిరుగాడుచుంటిని! రోజంతియు నీ కొరకు ప్రతీక్షించుచుంటిని! నీ ఇంటిని, నీ యిల్లాలిని, కడకు నీ శరీరమునుకూడ మరపించునట్టి ప్రీతికరమా నీ మృగయావినోదము! అటుల చూడుము! విహంగముల జంటలు కులాయములలో ప్రవేశించి బిడ్డలను చంచువులతో చుంబన మొనర్చుచున్నది! ఆ గూండ్లలో నామోద ప్రమోదముల కలవరము! నా యింట నిశబ్దమయశూన్యము! ప్రియా! ఏలోపమువలన నా యిల్లువదలి యితరచోట్ల తిరుగాడుచుంటివో నేనెరుగవచ్చునా"

మనువు కరుణరసముట్టిపడునట్లీవిధముగ వక్కాణించినాడు. "శ్రద్ధా, నీవలన నేలోపమును లేదు. కాని నేనే ఏదో తెలియనికొరతవలన బాధపడుచున్నాను. నా కత్యంత ప్రియకరమైన వస్తువును జేనిదో కోలుపోయినట్లు నాకు విపరీతానుభవము కలుగుచున్నది. తత్స్మరణ మాత్రముననే నాకు వ్యాకులము కల్గుచున్నది–

నేనొకమాట నడిగెదను. శ్రద్ధా నిన్ను గాఢముగ ప్రేమింపగోరు నాపట్ల నీ వేల యుత్సాహవిహీనవైతివి? ప్రియా! హర్షముతో నొడలు పరవశమానట్లు నవ్వుచు మాటాడు, నీ మధుర కంఠమునుండివచ్చు ప్రతి మాటయును నా బ్రతుకున కొక తీయనిపాటకావలె! కాని ... ఒకప్పుడు నా జీవనమునే మరపించిన నీ ప్రేమలోనివ్యగ్రత మేమైపోయినది? నీవు దినమంతయు కదుటితో నూలు వడకి కాలమును వ్యస్తమొనర్చుచుంటివి. మనము ధరించుటకై చర్మములకొఱత లేనప్పుడీవస్త్రముల నెవ్వరికై సిద్ధపరచుచుంటివో చెప్పు! ఇందేదో రహస్యము దాగియున్నది. శ్రద్ధా, త్వరగా చెప్పు!"

శ్రద్ధ:–నాకు పశువధోద్యోగమున లభించిన చర్మవసనముల నుపయోగించుటయిష్టముగనున్నది. అందువలనే కదుటితో నూలువడకుచుంటిని. ప్రియా! ఒక్కమాట, ఆత్మరక్షణకై వస్త్రములను ధరించి క్రూరజంతువులను వధించుట మంచిదే! కాని, నిరపాయకరములైన పశువులనేల నీ కొరకు కత్తులతో నరకెదవు? ఆ సాధు జంతువులనేల జీవించనీయరాదు? పశువులకంటె శ్రేష్ఠులమైన మనము, కనీసము మన లాభముకొరకైన వానికేల జీవించు నవకాశమీయరాదు?"

మనువు:–"శ్రద్ధా, అహింసత్యాగము అను సారవిహీనపు పలుకుల వ్యాఖ్యానము నా చెవులకెక్కదు

నేనెప్పుడును ఐహికభోగములనుండి వంచితుడను కాజాలను. జీవితకాలము చాల పరిమితమైనది. అమూల్యమైనది. జీవితసౌఖ్యమును పరిపూర్ణముగ భోగించుట నా నిశ్చితాభిమతము. హింసయే నా కానందము నిచ్చుచో - దాని నెప్పుడు విడువక, తత్ప్రవృత్తి నొక వరప్రసాదముగ భావింతును. దానికేమిలెమ్ము. కాని - శ్రద్ధా! మరల నొక్కసారి చెప్పుచున్నాను, నీ పరిపూర్ణ ప్రేమను నాపై కేంద్రీకరింపుము. నీ కంటిపాపలో నెల్లప్పుడును నా చిత్రము నేచూచి యానందింతునుగాక! నా హృదయ దర్పణమునందు సదా నీ చిత్రమే విద్యమానమగుచుండుగాక! నవ్వుము, శ్రద్ధా, నవ్వుచు మాటాడుము."

శ్రద్ధ యతని హస్తమును పట్టుకొని "నేనొక నూతన ప్రపంచము నిర్మించితిని. దానిని తిలకించి యానంద ప్రమోదముల నందు"మని మనువును కంధరాంతర్భాగముననున్న కుటీరమును చూపెను. ఆ కుటీరమునందొక ఊయల వ్రేలాడుచు కనుపించినది. ఊయలను చూచుటతోడనే 'ఇదెవ్వరికొరకో' యని వేదననొందిన మనువుయొక్క మనమున తొలిసారిగా 'ఈర్ష్య' యుదయమయ్యెను.

"మనూ! ఈ కులాయమేర్పడినదే కాని ఇందు వసించు పక్షి యింకను రాలేదు. నేడో, రేపో వచ్చును. వచ్చిన తరువాత నా పక్షి నగ్నముగ నుండరాదు కదా ప్రియా! ఆ పక్షి మన శిశువు. ఇక నీవు వేటకుపోయినను ఈ యిల్లు నిశబ్దమయాశూన్యముగ నుండబోదుసుమా! ఆ శిశువు నీ యూయలలో లాలింతును. తన మధురవాణితో నన్నాశిశు వానంద పరచుచుండును — తెలిసినదా!"

మనువు:—"హాతోస్మి, శ్రద్ధా! ఐనచో నీ ప్రేమ ద్విధాభాజ్యమైనదన్నమాట! అట్లు వీలులేదు. శ్రద్ధా! సౌరభతరంగములతో నూగులాడు పుష్పలతికవలె ఆనందమును పట్టజాలక నీవూగులాడుచుండగా నాభియందే సుగంధము నుంచుకొని దానికొరకై వనముల తిరుగాడు కురంగమునైవలె, నిన్ను నా చెంతనే యుంచుకొని ఆనందముకొరకై పరితపింపజాలను తెలిసినదా? నేను నీ సంపూర్ణ ప్రేమను వాంఛించుచున్నాను. అట్టి యవిభక్త ప్రేమనుపొంది, నిన్ను భోగించి స్వాత్మానంద మందెదను ... ఆ ... అట్లుకాదు మరచితిని! నీ యందలి భోగము నాకవసరములేదు. శ్రద్ధా! నీ ప్రేమ నర్థించుభిక్షువునై ఇక నేనుండజాలను. నీ సుఖములను నీవే యనుభవించి నా బాధలకై నన్ను దుఃఖింపనిమ్ము. నేనొక కంటకమును. నన్నేరి పారవైచి నీ నవపుష్ప గుచ్ఛమునకు నిత్యనూతన సౌఖ్యములను చేకూర్చుకొనుము, నేనిక పోదును" అనుచు మనువటనుండి వెనుదిరిగి చూడక వేగముగ నడచి వెడలెను.

"ఓ నిర్మోహీ — ఒక్కమాట నిలు - నిలు నిలు!" అని శ్రద్ధ యవ్యధానముగ నరచినది. ఆ యాక్రోశము లడవిపాలైనవి. అప్పటికే మనువు కనుచూపుదాటినాడు.

## ఇడ

శ్రద్ధను వీడిన తరువాత మనువు మరల తన జీవనగాథను తలచి దుఃఖింప మొదలిడినాడు. ఏల తన జీవనము నిస్సంతోషమై, దుఃఖాంధకార సమాచ్ఛాదితమైనదో యాతని కవగాహన కాకుండెను. అట్టి సమయమున, నాతని మనమున పశ్చాత్తాప బీజములు ప్రాదుర్భావ మందెను.

"నేను వట్టి మతిహీనుడను. నాకై జీవనసమర్పణ మొనరించిన శ్రద్ధాదేవియొక్క ప్రేమలతలను మొదలంట త్రుంచిన నిర్దయుడను. కడకు నా భావి సంతానమైనను, శ్రద్ధయొక్క ప్రేమకు పాత్రము కారాదని వాంఛించిన మమతాహీనుడను. ఈర్ష్య, పూర్ణరూపిణియై యంతరంగము నావరించినది! నా యంతటి ఈర్ష్యాళువును నేనే — శ్రద్ధను నిరాకరించి సౌఖ్యాన్వేషణమునకై నేను పయనించు మార్గము ముందు పూలబాటవలె కన్పట్టి, అందు ప్రవేశించుసరికి కంటకాకీర్ణమై నిజస్వరూపమును ధరించినది"

(సశేషము)

# శ్రీ రామ కర్ణామృతము

(ఆంధ్రానువాదము)

ద్వితీయాశ్వాసము

శ్రీ కల్లూరి అహోబలరావు



(గత సంచిక తరువాయి)

౧౦౧

పాలసముద్రంబు బరగు ! నా మధ్యలో
చంద్ర ఖండంబుల సొరుఁగల్గు
ముత్తెంపు దీవి – సమ్మోదమున శోభించు
నందు, 'సుధర్మ' యనం - దనరెడి
సభయుండు ; తన్మధ్య సార్థకమా, బిందు
వొకటి ప్రకాశించు నొప్పుగాఁగ
నాదిశేషుండందు మోదంబుగా నుండు
నతనిపై, శ్రీరామ ! యధివసించి
కుండల, కిరీటహారముల్, నిండుగ - భుజ
కీర్తులనుగల్గి, శ్రీరామ మూర్తి! వఱలి
నావు ; శ్రీ వత్స చిహ్నంబు నాణెముగను
దాల్చితివి, వందనములు కోదండరామ !

౧౦౨

సూర్యచంద్రాగ్నుల - శోభించు జ్ఞానచ
క్రమమయోధ్యలోనఁ దుఁగ్రమముగాఁగ
నా చక్రబిందువు నందు, బాలార్క తే
జస్స్వరూపుఁడగుచు సారసాక్ష !
తారకరామ ! హస్తములందు, పాశాంకు
శంబులు, బాణముల్ చారు విల్లు
ధరియించి, చిఱునవ్వు దాండవం బాడు, నె
మ్మోముతో, మోహన మూర్తి
యగుచు
స్త్రీ పురుష రూపము ధరించి, చెలువుగా, వి
లాసములకెల్ల స్థానమై - లాలితముగ
వెలుఁగుచున్నావు ; శ్రీరామ వేడ్కతోడ
నిన్ను భజియింతు రక్షింపు సన్నుతాంగ !

౧౦3

రత్నకిరీటంబు - రత్నకుండలములు
కర్ణభూషణములు గ్రాలుచుండ
ధనువు, శంఖంబును ధరియించి, పాశాంకు!
శంబులు, బాణహస్తమును గల్గి
చక్ర గదాపద్మ చారు రేఖలు గల్గు
కరముల వెలయుచు హరుఁడుబూజ
రక్తిని సల్పంగ, రక్తపదాబ్జుఁడై
విష్ణురూపముతోడ వెలసినావు
ధరణిజాత సీతనుగూడి ధన్యుఁడగుచు
సతము చిఱునవ్వుతోఁ బ్రకాశంబుగాఁగ
వెలుఁగుచున్నావు రక్షింపు ; వేదవేద్య
రామ ! తారక నామ ! భద్రాద్రిసోమ !

౧౦౪

భాసిలెడి, సహస్రార పద్మమందు
కర్ణికామధ్యమునను, ప్రకాశరూపుఁ
డై, వెలుంగుచు, జన్మజరా విహీనుఁ
డగుచు, తేజస్స్వరూపుఁడై - యాదిమూల

కారణుండయి, నిత్యోదైకమల నాభ!
రామ! చెల్వొందుచున్నావు రమణిఁగూడి
కారణమునకుఁగారణ కర్త వీవు!
నిన్నుస్మరియించి భజియింతు నీరజాక్ష!

౧౦౫

నిఖిల లోకంబుల - నిర్మలరత్నంబు
సచ్చిదానందమా సత్యరత్న
మర్కబింబాంతర మండలి రత్నంబు
పురహర జపరత్నమరయ, సకల
హృదయాంత రంబుల మెదలెడిరత్నంబు
వైకుంఠ రత్నంబు; భాగ్య రత్న
మరయఁగా, వేదవేదాంత రత్నంబు; శ్రీ
రామరత్నము; మిత్రరత్నమవని
జాతయావన రత్నంబు; చారు రత్న
మవని, యిక్ష్వాకు వంశాబ్ధియందుఁబుట్టి
నట్టి, రామరత్నమును, చేబట్టి నేను
శీర్షమున భక్తిధరియింతు హర్షమలర.

౧౦౬

దశరథ వంశరత్నము; నిర్మలానంద
రత్నంబు! వైకుంఠ రత్నమరయ
మునిజన జపముల ముఖ్యరత్నము; నీర
జాంతస్థరత్నంబు సాటిలేని
గుణరత్న మింద్రుండు గోరి స్తుతించెడు
పావనరత్నంబు; భవుఁడుజపము
సేయు రత్నము; సదాచిన్మయానందమా
ద్వాదశాంత స్థరత్నంబు; రామ
రత్నమిది, పరమపదవి రత్నమరయ
నాద నాదాంత రత్నంబు మోదమొసఁగు
నట్టి, షోడశదళ పద్మమందు మెలఁగు
రామ రత్నంబు నన్ను - సంరక్ష సల్పు.

౧౦౭

సకల సుకృత రత్నము! సత్యశాంతి శమద
మాది గుణరత్న మానందమైన శాశ్వ
తంబయిన, రత్నమరయ సౌఖ్యంబొసంగు
ప్రణయ నిలయరత్నంబు; శ్రీ రామనామ
రత్నము, పరమపదవిని రక్తినొసఁగు
రత్నమూహింప స్ఫుటమైన రాజరత్న
మవని శ్రీరామ రత్నంబు నలవియగునె
పొగడ, యట్టి నామమునన్నుఁబ్రోచుగాత!

౧౦౮

నిత్యతత్త్వంబిచ్చు - సత్యమంత్రము రామ
మంత్రంబు సాటి యీ మహిని గలదె!
సంసార దుఃఖంబు సమయఁజేసెడునట్టి
రామ మంత్రము సాటి భూమిఁగలదె?
పార్వతీ శంకరుల్ భక్తిని స్తుతియించు
రామ మంత్రము సాటి భూమిఁగలదె?
జానకీదేవి సంస్మరణ మొనర్చు, శ్రీ
రామ మంత్రము సాటి భూమిగలదె?
ఆంజనేయుండు నుతియించు యమలమంత్ర
మఖిల దురితంబులను బాపు నట్టి మంత్ర
మఖిల నిలయమంత్రంబు, రామాఖ్యమంత్ర
మరసి సేవింతు సతతంబు హాయిగొలుపు

(సశేషము)

# అభాగ్యులు

మాతృక :
'ప్రసాద్'

అనుసరణ :
"హృదయిని"



'ఏయ్ ! ఎవర్నీవు ?'

'... ... ... ...'

'మాట్లాడవేం ?'

'... ... ... ...'

'సరే ఉండు. కేకవేసేవా ఎవరినైనా' అని యామె తన చిన్ని నోరును తెఱచినంతనే ఆ యువకుం డొక చేతితో నామె నోటినిమూసి, రెండవచేతితో నామెను తన విశాల వక్షమున కదిమి పట్టుకొనెను. ఆమె వివశురాలై యూరకుండిపోయెను. నేఁ డామె తొలిసారిగా యౌవనభరోద్వేలితాలింగనము పొందెను. జాబిలికిరణములును గాలి విసరుతో పాటు కిసలయముల నెట్టుకొని ఆ జంటపై ప్రసరించెను. ఇంతలో ఆ లతాకుంజమునుండి నెట్టుకొనివచ్చుచున్న వెన్నెలలో రత్నఖచిత ఖడ్గము తళతళ మెఱసెను. భయభీత హరిణశాబకమువలె నామె నల్లని కన్నులు దయమాలిన యీ స్థితిలో దయాభిక్షను — ప్రాణభిక్ష నర్థించెను. యువకుఁడు ఆమె నోటిపైని చేతిని తీసివేసెను. అతఁడు తన వదనముపై ప్రేలుంచి నిశ్శబ్దముగానుండ సైగజేసెను. ఆబిడపేరు నూరీ. కాశ్మీరదేశపు కలువకన్నె. సిక్రీమహలులో నామె కోమల చరణముల నృత్యకళా కౌశలము ప్రసిద్ధి వహించెను. ఆ కన్నె పొంగ్గ మకరంద విలాసము మర్యాద భరితము. ఆమె ఆ యువకుని తనకై సాహసించిన ప్రేమికునిగా - మహాబలి అక్బరుదాగుడు మూతలాట సమయమున మిణుగురు పురుగువలె ప్రాణములు పోనొట్టుకొనవచ్చిన ప్రేమికునిగా — తలంచెను. ఈ కాల్పనిక సౌఖ్యములో తనను ధన్యురాలినిగా భావించి నిశ్శబ్దముగానుండి యువకుని మధురాధరములపై తన అరుణాధరముల నుంచెను. యువకుఁడుగూడ తన్ను దానుఱచిపోయి యీ సౌఖ్యములో నొక క్షణము గడపెను. నూరీ మెల్లగా — 'ఇక్కడ నుండి త్వరగా వెళ్ళిపో. రేపు వంతెన దగ్గర తొలిజాముగంట మ్రోగునపుడు పొగడచెట్టుక్రింద కల్సికొందును' అనెను.

యువకుఁ డచటనుండి మెల్లగా తప్పుకొనెను. నూరీ తడబడు కాళ్ళతో నింకొక పాదపువైపు నడచెను - ఆసవ మెక్కువ పుచ్చుకొన్నట్లు ఆమెను బోలిన సుందరీమణు లెందఱో అక్బరు నన్వేషించు చుండిరి. నీలగగనమందలి చందమామ యీ యాటను జూచి నవ్వుచున్నట్లుండెను. నూరీ కిపుడు మరే పొదలో జొరబడుటకు సాహసము చాలకపోయెను. నర్గీసు ఒక కుంజమునుండి వెల్వడి నూరీని 'ఏమిటి ? అటు చూచుచు వచ్చుచున్నావు' అని అడిగెను.

'ఊహుఁ, నాకేమి దొరకలేదు.'

'అయితే, ఇటు కామినీకుంజములలో చూతుమా?'

'నీవే వెళ్లు. నేనలసిపోయినాను.'

నర్గీసు వెళ్ళిపోయెను. వంగిన మాలతికొమ్మ చీకటి నీడలో కొట్టుకొనుచున్న గుండెలపై చేతి నుంచికొని నూరీ నిలువబడెను ! వెనుకనుండి యెవరో యామె కన్నుల మూసిరి. నూరీ గుండె మఱింత కొట్టుకొనసాగెను. ఆమె తెచ్చుకొన్న ధైర్యముతో.

'నేను గుర్తించితిని !'

'... ... ... ...'

'జహాఁపనాహ్' అని యామె నోటినుండి వెల్వడెనో లేదో అక్బరు ఆమె ముఖమునుమూసి మెల్లగా చెవిలో నిట్లనెను_

'మరియెవ్వరకు చెప్పకు - మహారాజ్ఞితో కాదు. తెలిసినదా ? నేనాపొదలో నుందును.'

అక్బరు వెళ్ళినంతనే మహారాజ్ఞి యటకు వచ్చెను. నూరీ యామె యంతఃపురములోనిదే, కాని అక్బరు

ఆజ్ఞ! ఆమె రాణికి 'అటు' అని చూపించి తప్పుకొనెను. మరియమ్మ మెల్లమెల్లగా నటకువచ్చెను. ఆ క్రైస్తవ బేగము ఈ భోగవిలాసపుటనుభవము లేనిది. అయినను ఆమెకీ మనోరంజనము నచ్చెను. నూరీ యాబిదకు అక్బరున్న పొదను జూపించెను.

కొన్ని గంటలపాటు లతాంగులంద అలసిపోయిరి; అపుడక్బరు మరియమ్మ చేతిని బట్టుకొని బయటకు వచ్చెను. నౌబత్ఖానానుండి మధుర రాగము విన వచ్చుచుండెను. అక్బ రొకసారి నూరీని పరికించి చూచెను ఆమె నునుబుగ్గపై మెల్లనకొట్టి బహుమాన మిచ్చెను. దాగుడుమూతలాట అయిపోయెను.

## 2

సిక్రీస్వరమ్ము కంపించుచున్నట్లే నూరీ హృదయము ఆందోళితముగుచుండెను. ఆవసంత జ్యోత్స్నలో తన ప్రేమికుఁడు వచ్చినట్లే యామె భ్రమించెను. ఆమె యుల్కిపడి చూచెను, కాని అటకెవరు రాలేదే! ఆమె పొగడచెట్టుక్రింద కూర్చుండి యపుడే యొక గంట దాటిపోయెను. జీవితములో ఆమె అభిసరించుటకు సాహసించుటిదే మొదలు. భయముచే నామె మనము కంపించుచుండెను. కాని మరలిపోవుట కామెకు మనసగుటలేదు. ఆమెకు ఉత్కంఠ, ప్రతీక్ష ఇత్యాది చెలికత్తెలుగా తోడై యుండిరి. వెన్కపాటున సవ్వడియైనది - 'ఇదిగో నేను వచ్చితిని' అని. నూరీ తిరిగిచూచెను - పొడగరి, ఎఱ్ఱని యువకుఁడు. వెన్నెలలో నాతనిని గుర్తించెను. 'షాహ్జాదా యాకూబ్ ఖాన్ గారా!' అను మాట లామె నోటినుండి వెల్వడెను.

'ఆఁ, నేనే! చెప్పు నీ వెందుకు పిలిచితివో?'

నూరీని మౌనము చుట్టుముట్టెను. అతని ప్రశ్నలో ప్రేమ అక్షరమాత్రమయిన లేదు. మహలులలో నివసించెడి యామెపై పై ఎత్తువేసెను.

'మీ రక్కడ కెందుకు వచ్చితిరి?'

'నే నీ ప్రశ్నకు ప్రత్యుత్తర మీయక పోయినచో'?

నూరీకి జవాబు తోచలేదు. యాకూబు 'అప్పటినా రాకను తెలిసికొన గోరుచుంటివా?' అన్నాడు.

'చెప్పవద్దులెండి!'

'చెప్పినచో నాకు ...'

'మీరు భయపడుచున్నారు, చెప్పకండి.'

'సరే నీ దేయూరో నిజము చెప్పు?'

'కాశ్మీరు!'

యాకూబు నూరీ దగ్గఱకు చేరి కూర్చుండి, 'కాశ్మీరులో ఎక్కడ?'

'శ్రీనగరు దగ్గఱే మా యిల్లు.'

'ఇక్కడేమి చేయుచున్నావు?'

'నాట్యము చేయుదును. నా పేరు నూరీ.'

'కాశ్మీరు పోవలెనని నీకు లేదా?'

'లేదు.'

'ఎందుకని'?

'అక్కడకు వెళ్ళి యేమి చేయుదును? సుల్తాను యూసుఫ్ఖాను మాయిల్లు - వాకిలి అపహరించివేసినాఁడు, మాయమ్మ జైలులో కొనయూపిరితో నున్నదో, తుది యూపిరి విడిచెనో!'

'నేను మీకు సుస్థితి గల్పించెదను. నీ విక్కడ నుండి బయల్దేరు.'

'ఊహుఁ, నేనిక్కడనుండి కదలలేను. కాని నిన్న మీరక్కడ కెందుకువచ్చినారో గ్రహించాను.'

'అయితే మంచిదే. నూరీ! నేనుగూడా ఖైదీనే. ఇట అక్బరుచేతిలో చిక్కుకొని కొట్టుకొనుచున్నాను. రాత్రి నేను వచ్చినది వాని గుండెలో కత్తిగ్రుచ్చుటకు.'

'సమ్రాట్ అక్బరు హత్యకా!?' భయకంపితయైన నూరి ప్రశ్నించెను.

'అవును నూరీ! నీ వాసమయమున నటకు రాకున్నచో ఆపని ముగిసియుండెడిది. కాశ్మీరు

స్వాధీనము చేసికొన్న యాతని ...' యాకూబు ఆగి వెనుదిరిగి చూచెను, దూరాన ఎవరో వచ్చుచుండిరి. నూరీకూడ లేచి నిలుచబడెను. ఇద్దఱు సరసువైపు క్రిందికి దిగిరి. నీటియొడ్డున కూర్చుండి నూరీ 'ఇఁక మీ రావిధముగా చేయకండి.' అన్నది.

'ఎందుకు చేయను! నాకు కాశ్మీరునుమించి ప్రియమయిన దేమున్నది? నేను దానికొఱ కేమయిన జేసెదను!' అని పల్కి యాకూబు నిట్టూర్పు విడచెను. అతని సుందరవదనము వేదనచే వివర్ణమాయెను. నూరీ చూచెను - అతఁడామె ప్రేమమూర్తి. అతని హృదయమున ప్రేమవిహరణ బంధురవాంఛ ప్రబలముగా నున్నట్లు కానవచ్చెను. ఇటు ఏకాంత ప్రశాంత వసంత మాదక నిశీథము! ఆమె 'మీకు కాశ్మీరుపై ప్రేమ యుండవచ్చునుగాని మిమ్ముల ప్రేమించుచున్నవారును ఉన్నారు!' అని మెల్లగా ననెను.

'పిచ్చిదానా! నాయెదుట ఒకటే చిత్రమున్నది- సింధూజీలము తీరముల ఫలపుష్పవనములు. నేను వానిపైని ప్రేమను వదలి యుండలేక ...'

'ఊరకుండుఁడు. మెల్లగా మాట్లాడుటరాక పోయినచో గుట్టుగానుండుఁడు?' అట్లుపల్కి నూరీ యొకసారి వెనుదిరిగి చూచెను. ఆమెను నారీసహజ చాంచల్య మావహించుచుండెను. ప్రస్తుతఘడియలు తన యౌవన వసంతమును సఫలము చేయునట్లుండెను! అటు ఆ విప్లవయువకుఁడు సమ్రాటు అక్బరు ప్రాణములు తీయుటో లేక తన ప్రాణములు తీసికొనుటో నిశ్చయించుకొనియుండెను. పెద్దలు చెప్పుచుందురు - తాపసులను పతితులను జేయుటకు అప్సరసలు తయారగుదురని. ఇపుడు నూరీ అప్సరస యయ్యెను. ఆమె - 'అట్లయిన నన్ను కాశ్మీరు తీసికొని పొండి,' యాకూబుచెంతకు మఱికొంత జరిగి భయభీత నేత్రములతో, 'చెప్పండి, నన్ను తీసికొని పోయెదరా. నేనును ఈ స్వర్ణబంధనముల త్రెంచుకొనగోరుచున్నాను.'

'నీవు నన్ను ప్రేమించుచున్నావా నూరీ!'

'రెండులో కాలకంటెను మిన్నగా,' - నూరీ యున్మాదిని యగుచుండెను.

'కాని నేనిపుడింకొకసారి నీవు నిరోధించిన యీపనిని నిర్వర్తించెదను. తప్పించుకొన్న తిరిగి వచ్చెదను, లేదా...' అని పల్కి యాకూబు ఆమె చేతిని పట్టుకొనెను. నూరీకి ఆపాదమస్తకమేమొ ఝుఝుపోయెను. ఆమె తన మోహనవదనమును యాకూబు భుజముపై వాన్చి పల్కెను — 'వద్దు, ఇపుడాపని చేయవద్దు, నా మీద ఒట్టు!'

హఠాత్తుగా యువకుడు ఒక్క ఊపున లేచి నిలబడెను. నూరీ సద్దుకొనిచుండ యాకూబు ఒక్కడ లేడు. నూరీ రెండడుగులు వేసినదో లేదో మందము తాతారినిష్ఠురహస్తము ఆమెభుజాలతపైబడెను - 'సుల్తానా నిన్ను చాల సేపునుండి వెదకుచున్నది?' అని వాడనెను.

3

సుల్తానా బేగము, అక్బరు పాదుషా చదరంగమాడుచుండిరి. చదరంగములో ఎత్తులు వేయుటకు సమర్థులు సుందరీమణులే. నౌబత్ఖానానుండి యుదయకాల మధురమయిన సన్నాయిస్వరము వినబడుచుండెను. నగారా అక్బరుకు ప్రీతియైన పద్ధతిలో వాయింపబడుచుండెను. దానిని ఆలకించుచు అక్బరెత్తు వేయుట మఱచిపోయెను. అతనివైపుననున్న వారు దెబ్బలు తినిరి.

దెబ్బలు తిన్న దెవరోకాదు; నూరీయే. ఆదెబ్బ లామెకు దుర్భరమయ్యెను. కొరడా చేతిలోనుంచికొని అక్బ రామెవైపు పరికింపసాగెను. 'నేజచ్చిపోయితని' - అని నూరీ బొబ్బలిడెను.

'నీవు చావవద్దు, బ్రతికి యుండు!' అని దక్షిణ వాయువువలె నామెమనను రంజిల్లుటకు చతురుఁడయిన అక్బరు సుల్తానాదిక్కు చూచి 'దీనిపేరేమి? ఆరాత్రి దాగుడు మూతలాట సంఘటనము గుర్తుకు వచ్చుచున్నది.' అని ప్రస్తావించెను.

'దీనిది కాశ్మీరు. పేరు నూరీ. అద్భుతముగా నృత్యము చేయగలదు.' సుల్తానా ప్రత్యుత్తరించెను.

'నేనెపుడు చూడలేదే!'

'అలాగయితే చూడండి!'

'నూరీ! ఈ సన్నాయి స్వరమున కనుగుణంగా నృత్యము చేయగలవా?'

'ఎందుకు చేయలేను ప్రభూ!'

అక్కడివారు తమ తమ స్థానములలో యథాతథంగా కూర్చొనిరి. నూరీ మైమఱపించు నృత్యమారంభించెను. గజ్జలు ఘల్లుఘల్లున మ్రోగుచుండెను. జలతరంగములవలె నామె చెంగు చెంగున నర్తించుచుండెను. సరిగమపదని అని సప్త స్వరముల బలుకుచు అనేక భంగిమలలో అడుగులు వేయుచున్నపుడు, కాలి అందియల మ్రోగించుచున్నపుడు అక్బరు 'వాహ్! వాహ్!' అని సాధువాక్యములు పల్కుచుండెను. ఇట్లొక గంట నృత్యము సాగినది, సన్నాయి యూగినది. అక్బ రామెను పిలచి, 'నూరీ, నీకేమి కోరుకొందువు?'

'ఏమియు వద్దు ప్రభూ!'

'ఏమియు?'

కొంచెమాగి, 'మా అమ్మ నొకసారి చూడగోర్కగా' నున్నది; తను సెలవైనచో' నతము స్తకయై నూరీ పల్కెను.

'ఛీ ఇంకేమియు వద్దా?'

'ఇంకేమియు వద్దు.'

'సరే, నేను కాబూలు వెళ్లునపుడు వత్తువుగాని.'

మఱల ఆట ఆరంభమాయెను. సుల్తానా, పాదుషాలు ఎవరు ఓడెదరా యని తమలో తాము తల పోయుచుండిరి. 'నీవు నాతో ఆడు, కాని ఎపుడును నీవే యోడిపోవుచుండవలెను సుమా' - అన్నదే కదా యీ ప్రపంచపురీతి. నూరీ తిరిగి దెబ్బలు తిన్నది. 'నేను చచ్చితి' నని యామె కూయిడెను.

(సశేషము)

---

# రాజకుమార్

ఫ్రెంచి మూలం : ఆంటోని డె సయింట్-ఎక్సుపెరే

తెలుగు అనువాదం : డాక్టర్ వి. ఎస్. శర్మ



[గ్రంథకర్త ఫ్రెంచిదేశీయుడు, ఆధునిక ఫ్రెంచి సాహిత్య రచనలలో సిద్ధహస్తుడు ఈ రచయిత. అంతేకాదు! వాయు విమానాలను నడపటంలో ఈయనకే పెట్టింది పేరు. ఇలా వాయు విమానాన్ని నడుపుతూ ఒకసారి అకస్మాత్తుగా ఆఫ్రికా ఎడారిమధ్యని ఆగాలసివచ్చింది. ఆ సమయాన ఆయనలో తట్టిన మనోభావాలను ఇలా "రాజకుమార్" అనే కథా శిల్పంద్వారా సాహిత్య లోకానికి సమర్పిస్తూ వున్నాడు. ఈ రచయిత ఇంతవరకు సాగిన కథాభాగంలో ఆయన విమానం చెడిపోవటం, దానిని మరమ్మత్తుచేయలేక తికమకపడుతూవున్న కాలంలో అకస్మాత్తుగా ఒక అబ్బాయి ఆయన ముందు ప్రత్యక్షమవటం, అబ్బాయి కోరికలను తీర్చటానికి బొమ్మలను గీసి ఇయ్యటం చదివాం. అలాటి సమయంలో ఆయనను కలవరబెడుతూవున్న సమస్య ఆ అబ్బాయి ఎక్కడినుంచి వచ్చాడని. ... ... ఇక చదవండి.]

## IV

అబ్బాయిని ఎలాగైతేనేం బతిమాలుకుని వాడు వచ్చిన లోకం గురించి తెలుసుకోవాలసినంత భోగాట్టానంతా తెలుసుకోవాలని నా ఆశ. తన లోకం నిజంగా వాడు అన్నట్లు చిన్నదా? లేక బ్రహ్మాండమైందా? నన్ను బుకాయించటానికి తను వచ్చిన గ్రహం ఒక ఇంటికన్నా చిన్నదనీ అన్నాడా? లేకపోతే నిజంగా పెద్దదా? ఇది పెద్ద సమస్య. దీన్ని తేల్చుకోకపోతే మనస్సు ఎలా కుదటపడుతుంది?

నేను ఇంతవరకు చూసిన పుస్తకాలనిబట్టీ, శాస్త్రజ్ఞులు అడపాదడపా చెప్పుతూవున్న మాటలనిబట్టీ, భూమి, బృహస్పతి, శుక్ర, శనిమండలాలు చాలా పెద్ద గ్రహమండాలని, వాటికన్నా చిన్నవి వందల కొలది ఎన్నెన్నో వున్నాయని అవగాహన చేసుకున్నాను. ఏ శాస్త్రజ్ఞుడైనా తన పరిశోధన మూలాన ఒక కొత్త గ్రహమండలాల్ని కనిపెట్టాడా, దానికి ఫలాని పేరని పెట్టకుండా, ఒక సంఖ్యను ఇవ్వాటం పరిపాటిఅయిపోయింది. అలాటి చిన్న చిన్న గ్రహమండలాల్లో ఒకదానినుంచి బహుశా ఈ అబ్బాయి వచ్చివుంటాడేమో మరి!

ఈ శాస్త్రజ్ఞులను గురించి, వాళ్లు అడపాదడపా కనిపెట్టుతూవున్న మండలాలనుంచీ నెమరువేస్తూవుంటే ఒక తుర్కీ దేశపు శాస్త్రజ్ఞుడు జ్ఞప్తికి వస్తూవున్నాడు. ఈయన తను ఈ తంతుకుగాను ప్రత్యేకంగా తయారుచేయించుకున్న యంత్రాల సహాయాన 1909 సం॥లో ఒక గ్రహమండ

లాన్ని కనుగొన్నాడు. దానికి 13612 అనే సంఖ్యను ఇచ్చాడు. ఆ రోజుల్లోనే నానా రాజ్యాల ఖగోళ శాస్త్రజ్ఞుల మహా సభ సమావేశమైంది. ఆ సభలో పండితుల ఎదుట తన పరిశోధనలని గురించి పెద్ద వుపన్యాసాన్ని ఇచ్చాడు. ఆయన డాబూ దర్పమూ అంటే ఏమిటో తెలియని అమాయకుడు. వాళ్ళంతా పడమటి వాళ్ళ దుస్తులను ధరించినవాళ్లు. ఈయనో-స్వదేశపు బట్టలని వేసుకున్నవాడు. ఇది వాళ్ళకు నచ్చుతుందా! సభలో వాళ్లు ఆయన చెప్పిందంతావిన్నా, అదంతా కట్టు కథఅని నిర్ధారణచేశారు. పెద్ద మనుష్యులు ఇలాటివాళ్ళనిచూస్తే, చేసేది అంతేగా!

తరువాత తుర్కీ దేశంలోని సాంఘిక పరిస్థితులు మారిపోయాయి. డిక్టేటర్ ప్రజలభాగ్య విధాత అయ్యాక జనాంగం అంతా పాశ్చాత్యపు దుస్తులను ధరించాలని ఆజ్ఞాపించాడు. ఈ ఆజ్ఞను ఎవళ్లయినా ప్రతిఘటించారా మరణ శిక్షకు పాలు గావలసి వస్తుందనీ ప్రకటించాడు. ఇక ప్రజలు ఆ ఆజ్ఞని శిరసావహించక మరేం చేయగలుగుతారు? ... 1920 సం॥లో ఖగోళ శాస్త్రజ్ఞులసభ జరిగింది. ఆ తుర్కీ దేశపు శాస్త్రజ్ఞుడు ఇప్పుడు పాశ్చాత్యుల దుస్తులను ధరించి సభలో వుపన్యాసం ఇయ్యటానికి వచ్చాడు. ఇప్పుడు ఆయన అన్నదే "అక్షరాలా" సరి అని శాస్త్రజ్ఞులంతా తలలూచారు.

ఇదంతా ఎందుకు చెప్పాలసివచ్చిందంటే మనుష్యుల తరహా ననుసరించి, వాళ్ల దేశాల వాలకాననుసరించీ ఇలాటి ప్రశ్నలన్నీ యథాతథంగా తేల్చుకోటానికి మార్గం వుంటుంది అంటే ఇలాటి పరిశోధనల సంగతి లోకానికి ముఖ్యంగా శాస్త్రజ్ఞుల సభలకు నచ్చచెప్పాలంటే, అసలు విషయానికన్నా పైపటాటోపానికి ఎక్కువ ప్రాముఖ్యత ఇయ్యాలసి వస్తుంది అన్న మాట.

ఎవళ్లూ వున్న సంగతి ఏదో తెలుసుకోటానికి వుత్సాహపడరు. అంటే అలాటి విషయాల్లో పనిచేస్తూవున్న శాస్త్రజ్ఞులకు అసలు సంగతులు క్షుణ్ణంగా అవగాహనం చేసుకొనటానికి పరిశ్రమ చేసినవాళ్లకైనా, ఎంతకాలం తమవంటి ఇతర్లు అందులో మునిగితేలుతూ వున్నారు అనే విషయం తెలుసుకోటానికి శ్రద్ధా, వోపికా బొత్తుగా వుండదు. అలాటి వాళ్లు తెలుసుకోటానికి వుబలాటపడేది, ఆ విషయంలో పరిశోధన చేస్తూ వున్నాయన వయస్సు ఎంత? అన్నదమ్ములు ఎంతమంది వున్నారు? పొడవు ఎంత? బరువు ఎంత? వాళ్ల నాన్నకు ఎంత సంపాదన? ఈ సంగతి తెలుస్తేనేగాని

(441-వ పేజి చూడుడు)

# కేనోపనిషదు

మూలం:
స్వామి చిన్మయానందజీ

అనువాదం:
డాక్టరు W. రాధాకృష్ణయ్య



## ద్రష్ట: (వ్యక్తమును అవ్యక్తమును చూచువాడు).

(గతసంచిక తరువాయి)

అన్యదేవ తద్విదితాదథో అవిదితాదధి అను భావమున విశేష అర్థము ఇమిడియున్నది. ఉపనిషత్తు మంత్రములు సామాన్యముగా పరిచయమగుట లేదు. అవి లజ్జావంతమై కడు మర్యాద ప్రేమను అభిలషించును. ఆ మర్యాద చూపక తరచుగా అందరు నిష్ఫలులగుచున్నారు. మనము ఉపనిషత్తులను ప్రాత దురభిప్రాయములతో సమీపించుచున్నాము. వాటితో వాదించి వాటిని తిరస్కరించ తలచెదము. కనుక అవి మనలను తిరస్కార భావములతో దూరమగుచున్నవి. వాటిని భక్తి ప్రేమలతో ప్రతిమాలిన యెడల, అవి మనలను దగ్గిర చేర్చి, తమ పూర్ణానందమును మనకు లభింపజేయును.

"సత్యము వ్యక్తము, అవ్యక్తమునకు అతీతము" అనగా బాహ్యమున విశేషమేమియు తెలియుటలేదు. విశదీకరించెదము. వ్యక్తము అనగా ఇంద్రియ మనో బుద్ధుల ద్వారా కనబడు విషయ ప్రపంచ దృశ్యమంతయు అని తెలియవలెను. ఇంద్రియ మనోబుద్ధులు, శుద్ధ ఎఱుక, సత్యపురుషునికి కరణములు. వీటిద్వారా చూచు ద్రష్టలేనిది ఇవి స్వయముగా చూడజాలవు. ద్రష్టను ఈ దృశ్య కరణముల సహాయమున చూడజాలము. కనుక ద్రష్ట, దృశ్యమునకు వ్యతిరిక్తము అవి తెలియుచున్నది. చంద్రుని చూచుచున్నాము. చంద్రుని చూచువాడు చంద్రుడు కాడు.

మరియు ఈ ద్రష్ట, చూచువాడు అగోచరము కాడు. చూచుచు, ఉన్నాడు అనుట నిజము. అవిదితాదధి. అగోచరమునకు అతీతము అని అర్థము. అగోచరమునకు అతీతము అనుటయందు సూక్ష్మభావమున్నది. శ్రద్ధతో విచారించవలెను. శ్రీ శంకరులు, అతీతము అనగా, భిన్నముగాయున్నది అని వ్యాఖ్యానము వ్రాసియున్నారు. ఒక తీగమీద ఒక పక్షి కూర్చునియున్నది అనగా, ఒక తీగయున్నది. దానికి భిన్నముగ ఒక పక్షి కూడ యున్నది అని అర్థము. అధికముగా అని అర్థము. ఒక మహాత్ముని జన్మదినము ఎన్నడు అను ప్రశంస వచ్చినది. నాకు తెలియదు అని ఒకడు చెప్పెను. తెలియదు అనుట బుద్ధివృత్తి. ఈ తెలియదు అను బుద్ధివృత్తిని తాను తెలుసుకొని అతడు చెప్పుచున్నాడు. కనుక ఈ తెలియదు అను వ్యక్తభావము తెలుసుకొనుచుండు అనుభవము అవ్యక్తమునకన్న అతీతము. అనగా భిన్నము అని భావము. సూర్యుడు విషయములనంతయు ప్రకాశింపజేయుచున్నాడు. అతడు ప్రకాశింపజేసుకొనుచున్నాడు. అది చెప్పనక్కరలేదు. ప్రకాశమునకన్న భిన్నముగా తాను ప్రకాశస్వరూపముగనే యున్నది. అగ్ని అన్నివిషయ వస్తువులను కాల్చును, తన్ను తాను కాల్చుకొనును అనుటలేదు.

కనుక నిత్యపరిపూర్ణ సత్యవస్తువు వ్యక్తమునకును, అవ్యక్తమునకును అతీతము అనగా, రెంటిని తెలుసుకొను ద్రష్ట్య అనవలెను. ద్రష్టకు వ్యక్తము తెలుసుకొను అవ్యక్తమును తెలుసుకొనుచున్నాడు. అట్టి శాశ్వత ఎఱుకయె ఆత్మ.

ఇట్టి వివరముకూడ పరిపూర్ణ నిర్వచనమని చెప్పజాలము. ఇతి శుశ్రుమ పూర్వేషాం. ఇట్టి మాటలతో బోధించుట వినియున్నాము అని, గురువు తన ఉపదేశమునకు కొంత బలము కలిగించుచున్నాడు.

గురు శిష్య పరంపరగా తెలియబడుచుండు జ్ఞాన బోధయందు ఆగమ శాస్త్ర ఆధారము ముఖ్యమని వేదాంతమున తెలుపబడుచున్నది. పరిపూర్ణ సత్య వస్తువును ఇంద్రియ మనో బుద్ధులతో ప్రత్యక్షముగ గ్రహించ జాలము. సత్యమును నిర్ణయించగల శక్తి మనవద్దలేదు. ఆత్మవిచార వినోద పరిశ్రమమునందు తగు ప్రమాణములు దొరకుటలేదు. మనకుగల ప్రమాణ మంతయు ఆగమ శాస్త్రము. అది గురుశిష్య పరంపరగా వచ్చుచున్నది. అందువల్ల ఈ కేనోపనిషదునందలి గురువు ఇతి శుశ్రుమ పూర్వేషాం అని, మేము వినిన విషయములను తెలుపుచున్నాము అని చెప్పుచున్నాడు. అనగా శ్రుతి ప్రమాణము ముఖ్యము అని భావము.

యద్వాచా౽నభ్యుదితం యేన వా
గభ్యుద్యతే
తదేవ బ్రహ్మత్వం విద్ధి నేదం యదిద
ముపాసతే ॥-4

వాక్కు చేత ఎయ్యది వ్యక్తముకాదో, దేనివల్ల వాక్కు వ్యక్తమగుచున్నదో అదియే బ్రహ్మము అని తెలుసుకొనుము. ఇచ్చట జనులు దేనిని ఉపాసించుచున్నారో అదికాదు.—

వాక్కు అనగా వాగేంద్రియము మాత్రము కాదనియు, వాక్కునగల అక్షరములు, వాటి వరుస క్రమము, సంఖ్య, వాగేంద్రియముచేత వాటిని ఉచ్చరించవలసిన రీతి అన్నియు కలసి వాక్కు అగుచున్నది అని శంకరుల అభిప్రాయము. వాక్శక్తి పదములలోలేదు. వాగేంద్రియమునలేదు. నిత్య ఆత్మ, ఆత్మ చైతన్య ప్రకాశమే వాక్శక్తి. మనము జీవించి యుండగా, ఏ జీవ కేంద్రశక్తివల్ల వాక్కు వెలువడుచున్నదో ఆ శక్తియే ఆత్మ. వాక్కునందు పదములు వెలువడు చుండినను, అట్టి పదములు వాటిని కలిగించు చైతన్యమును తెలుపజాలవు. అగ్ని ఇతర విషయములను భస్మముచేసి ప్రకాశింప జేయును. తన్నుతాను భస్మము చేసుకొనదు. ప్రకాశింప జేసుకొనదు. అదే రీతి వాక్కును ప్రకాశింప చేయగలశక్తి లేకున్నది.

ఇచ్చట, తత్ + ఏవ అని వున్నది. ఆ చైతన్యమే అని అర్థము. ఇందు కొంత విశేష ప్రాముఖ్యత యున్నది. మనము ఆత్మను వర్ణించ ప్రయత్నించినచో, పరిచ్ఛిన్న ఆత్మను మాత్రము వర్ణించగలము. శుద్ధ ఆత్మకు, నామరూపములులేవు కాబట్టి మనము నిర్దేశించలేము. ఎలక్ట్రిక్కు కరెంటును ఒక అమాయకునికి చూపలేము. సులభముగ తెలుప గోరినచో, బల్బు, అందుండు తీగను చూపి, నగరమున యుండు కరెంటు ఇట్టి బల్బులన్నిటిలో వ్యాపించి, లోనున్న తీగలను ప్రకాశింప జేయుచున్నదని తెలుపవలెను. ఆ ప్రకాశింపజేయు శక్తియే కరెంటు అని తెలుపవలెను. అట్టి అమాయకులు, కరెంటు అనగా నామరూపములు లేక బల్బుల తీగలలో ప్రవహించి వాటియందు ప్రకాశము కలగించు శక్తియే కరెంటు అని తెలియవలెను.

అదేరీతి ఇచ్చట తీవ్ర కుతూహలుడగు శిష్యునికి, గురువు తెలుపుచున్నాడు. ఆత్మ, జీవకేంద్రము, కంటియందుగల చూచు శక్తిగ, చెవియందలి విను శక్తిగ, వాక్కునందలి వాక్శక్తిగా ప్రకటితమగుచుండినను, ఆ పరిపూర్ణ సత్యవస్తువు ఈ కన్ను, చెవి, వాక్కు వీటిలో ఎట్టి సంబంధ పరిణామము లేక యున్నాడని విశదపరచి చెప్పుచున్నాడు. శుద్ధ ఆత్మ, ఎట్టి పరిణామములేక, తన సర్వవ్యాపక పరిపూర్ణ స్వరూపమున తెలియుటకుగాను, శ్రుతి ఇందు, తత్ + ఏవ, అని అతడే పరబ్రహ్మము అని తెలుపుచున్నది.

శిష్యునికి దేహ సంబంధ జీవ వ్యవహారములను విమర్శించు చుండినను, వ్యవహరించు నతడే బ్రహ్మమని తెలియుము అని గురువు నొక్కి చెప్పుచున్నాడు. అట్లు వ్యతిరేకముగ తెలుసుకొని, అనుభవించబడునదే పరిపూర్ణ సర్వవ్యాపక శుద్ధసత్యము - పరమాత్మ - అని శ్రుతి స్పష్టముగ తెలుపుచున్నది. ఇందు వ్యత్యాస భావము లేమియును లేదు. మనయందుండు ఆత్మను మనము అనుభవించ గలిగిన సమయమున సర్వ ప్రాణుల యందుండు ఆత్మ, శాశ్వత, అప్ర

చ్ఛిన్న, మూలాధార పరబ్రహ్మము అతడేనని తెలుసుకొనగలము.

మన అంతరమున కనుగొనిన ఆత్మయే సర్వవ్యాపక పరిపూర్ణ ఆత్మయని ముందు విచారించి యున్నాము. ఘటాకాశమును, సర్వ వ్యాపక మహాకాశమును ఏకమని నిరూపించి యున్నాము. ఈ ఘటాకాశము, కుండ యుండునంత కాలము దానితో సంబంధము తెలుపుకొనగలదు. ఇట్లు ఒక మహాత్ముడు ఆత్మానుభవమున వేదాంత సాక్షాత్కారము పొందగలిగినపుడు, పరబ్రహ్మయొక్క అద్వైతమును బాగుగా అనుభవించ గలుగుచున్నాడు.

అదియే బ్రహ్మము అని తెలిపి శ్రుతి మౌనము వహించుటలేదు. అట్లూరకుండినచో, మనకు దృశ్యమగునవి యంతయు ఏమి? రామ, కృష్ణ, శివుడను ఇష్ట దేవతలన్ని ఏమి? అను సంశయము కలుగును.

నేదం యదిద ముపాసతే॥

మీరు ఉపాసించునదంతయు కాదు, అని స్పష్టముగా శ్రుతి ఖండించు చున్నది.

ఇది అని తెలిపినపుడు మనము తెలుపునది మన జ్ఞానేంద్రియములలో నొకదానికైన, మనసుకు, బుద్ధికైన తెలిసిన విషయముగా నుండవలెను. ఏది కనబడుచున్నదో అది ద్రష్ట కాదు. మానవ కరణములకు మూలాధారముగ నుండు దానిని గురించి మనము విచారించు చున్నాము. కనుక మనము దేనిని, "ఇది" అని చూపుచున్నామో అది పరిచ్ఛిన్న ఆత్మగా యుండవలెను. సూర్యుని ప్రతిబింబము సూర్యుడు కాడు. కనుక ఇది అనబడునది ఆత్మ కాదు. కనుక ఏది ఆత్మ కాదో అది నిత్య సత్యము కాదు.

ఇచ్చట శిష్యునియందు నాటుకొనియందు భక్తి సాధనయందలి అభిప్రాయము. నామరూపములుగల భగవంతుడే పరమాత్మ అను భావమును చక్కని మాటలతో తొలగించు చున్నాడు.

మంత్రమునందలి ఈ భావమును ఆధారము చేసుకొని విగ్రహారాధన యనబడు భక్తి మార్గమును హేళన చేయరాదు. కీర్తన, జపము, ధ్యానములవల్ల సంస్కరింపబడి ఉన్నత పదవి పొందిన సాధకులు సత్య సామ్రాజ్యమును చేరగల యాత్రకు అర్హులగుచున్నారు. ఇందు సాధకులను ఖండించుట శ్రుతి అభిప్రాయము కాదు. వారికి ప్రేమపూర్వక కైదోడొసగి, పారమార్థిక గమ్యస్థానము చేర్చుటయందు సహాయపడుచున్నది.

రామ పట్టాభిషేక చిత్రమునుండి అందలి సింహాసనమునకు మరుగునయుండు రామ తత్వ సాగరమును చేరుటకు, రాముని ద్వారా రామ తత్వము చేరుటకు, కృష్ణుని ద్వారా కృష్ణ తత్వము చేరుటకు, నామరూపములద్వారా వాటి కతీతముగనుండు ధామమును శిష్యుడు సులభముగ చేరుటకు కరుణా స్వరూపుడగు ఉపనిషత్తు ఋషి సహాయపడుచున్నాడు.

భక్తుడు తన హృదయ ప్రియుడగు పరమాత్మతో ఐక్యము పొందుటకు ఉపనిషత్తులు సహాయపడుచున్నవి. భక్తునికి భగవంతునికి వేదాంతము నిష్క ప్రస్తము కుదుర్చుచున్నది. సాధకుడు భగవంతుడొకడే యుండునది. నేను నాది, అనునదంతయు కల్ల, భ్రమలు నాట్యమాడుచున్నవి. నిజముగ లేవు, అని తెలుసుకొనుటతో అతని సాధన పూర్తియగుచున్నది.

అట్టి పరిస్థితి ప్రత్యక్షము పొంది, ప్రతిభక్తుడు స్వానుభవముగ తెలుసుకొనవచ్చును — దీనికి అతని భక్తి గాఢముగను, పరిపూర్ణముగను యుండవలెను — అని వేదాంతమతము మరలమరల తెలుపుచున్నది. ఇతర మతములు ఎచ్చట విరమించి విశ్రమించుచున్నవో అచ్చట వేదాంతబోధ యారంభమగుచున్నది. మానవుడే మాధవుడు. మాధవుడే సత్యము. మిగతెల్ల మిథ్య. మన దుఃఖపూరిత సంసారస్వప్నము నుండి మన జాగ్రతావస్థకు మనలను వేదాంతము లాగుచున్నది.

వేదాంతము భక్తిని ఖండించు మతము కాదు. వేదాంతము తెలియని భక్తి పూర్ణ భక్తి కాదు. భగవంతుని భక్తితో ప్రేమించలేని వాడు వేదాంతి కాజాలడు.

ప్రేమరహిత మత సిద్ధాంతము వెఱ్ఱితనము. మత సిద్ధాంతములో కూడని ప్రేమ కేవలం అజ్ఞానము. గొప్ప మతాచార్యుల అభిప్రాయము నేటివరకు ఇట్లున్నది. ఇట్టి గొప్ప విషయమును మనము మరువకుందుముగాక!

### మనసే మానవుడు

మనసు అనునది ఏమి? దీనినిగురించి ఎందరు విచారించగలిగియున్నారు? మనలో ఒక సుగుణము ఏర్పడుటకుకూడ, మనసు అనునది ఏమిటో తెలుసుకొనవలెను. మనసును కనుగొనుట చాలకష్టము. కాని అది బుద్ధి గ్రాహ్యము. ఉదాహరణముల ద్వారా తెలుపవచ్చును. మనసు అనునది మనలోనుండు వాసనలరాశి అని శాస్త్రములు తెలుపుచున్నవి. మనసును గంగానదికి పోల్చబడుచున్నది.

నది అనగానేమి? రెండుగట్టుల నడుమగల నీరు నదికాదు. రెండుగట్టుల నడుమ నిలచియుండు నీరు నదికానేరదు. నదియని నీటిప్రవాహమునకే తెలుపబడును. పర్వతములనుండి సముద్రమువరకు ప్రవహించు నీరు నదియనబడును. అటులనే నిరంతర ఆలోచన ప్రవాహము మనసు అనబడుచున్నది. ఆలోచనలు మనసునందు ప్రకటితమగుచున్నవి. ఆలోచనలు వేగముగ ఒకటి వెంబడి ఒకటి ప్రవహించుచుండిన మనసు అగుచున్నది. ఈ ప్రవాహమును ఆపగలిగినచో మనసు ఉండదు.

రాత్రి వేళ ఒక పూదువత్తిని గిరగిరత్రిప్పినచో, ఒక ఎర్రని వర్తులము ప్రకాశమగుచున్నది. నిజముగా వర్తులము లేదు. అదియంతయు పూదువత్తియొక్క చలనము. పూదువత్తిని నిశ్చలముగ పట్టుకొనినచో వర్తులములేదు. ప్రకాశములేదు. ఒకే పూదువత్తి వర్తులాకారమున అన్ని భాగములయందును చరించుచుండినందువల్ల ఎర్రని వర్తులము ఉన్నట్లు భ్రమ కలిగెను. పసిబాలుడు ఆవర్తులము ఒక ఘనమైన ప్రకాశమని, నిజమైన చక్రమని నమ్మగలడు. అటులనే, మనము అజ్ఞానమువల్ల, అల్పఆశలకు లోనై స్వార్థము, భ్రమలుకూడుకొని, వేదములు మహాత్ములు తెలుపు మనయందలి పూర్ణానందపదవిని పొంద యత్నించక బింబమునువిడిచి ప్రతిబింబముకొరకు పరుగిడుచు, జీవితమునంతయు వ్యర్థముచేసుకొని అలసి నిర్వీర్యులగుచున్నాము. మతజ్ఞానము లేకున్నను, హిందూ మతస్థులమను గర్వముమాత్రము అధికముగ ప్రకటించుచు, హిందూమతమునకే అపకీర్తి తెచ్చుచున్నాము.

లెండు! మేల్కొనుడు! మీ గొప్ప వంశకీర్తికి యోగ్యులగు సంతతివారమని ఋజువుచేయుడు! మీలోనున్న గొప్ప పరమపదవి యొక్క తలంపులు తెరియుడు! పూర్వకాలమువలె, హిందూ దేశమునకు తన మత సామ్రాజ్య పట్టాభిషేకము కలుగించుటకు ప్రయత్నింపుడు! మనము హిందువులమై యుందుముగాక!

మనసు అనునది ఒక నిలుకడలేని ఆలోచనల పరంపరయని తెలిసిన యెడల ఆ పరంపరను వెలుగజేయు జ్యోతి యొకటి యుండవలెను. పగలు సూర్య ప్రకాశమువల్ల పుస్తకముల చదువగలుగుచున్నాము. కాగితముల పైనుండు అక్షరములు స్వయంప్రకాశములుగావు. జడము, వెలుతురులేనిది అవి కనబడవు. అటులనే ఆలోచనలు అనునవి స్వయంప్రకాశములు కావు. కండ్లు మూసినపుడు ఈ ఆలోచనల పరంపరను మనము కనుగొనుచున్నాము.

ఆలోచనలు స్థూలదేహమునకంటె సూక్ష్మము. ఆలోచన ప్రవాహమగు మనసు జ్ఞానజ్యోతివల్ల ప్రకాశించుచున్నది. మానసిక సృష్టియగు ఆలోచనలు మనలో స్థూలదేహభావమునకన్న అధికగాఢముగ నాటుకొనియున్నవి. ఈ స్థూలదేహము అనిత్యమని మనలో చాలమంది నమ్మగలుగుచున్నారు. కాని అట్టిభావముతో మనసును చులకనగా త్రోసిపుచ్చలేకున్నాము. ఈ మనసు ఆత్మసాన్నిధ్యమునకు సమీపమున నుండుటచేత, ఆత్మ యొక్క ప్రభావము, ప్రకాశము, తేజసు దానియందు కొంత ప్రతిబింబించుటవల్ల, తానుకూడ సత్యము నిత్యము అని భ్రమించుచున్నది.

ఆత్మ ప్రభావము మనసునందు వ్యాపించుచున్నది. ఆవ్యాపకమువల్ల అది వ్యవహరించుచున్నది. ఈ

ప్రకాశకిరణములవల్ల మనసు ప్రకాశించుచున్నది. సత్యభావమును కనుపరచుచున్నది. ఆలోచనలు ప్రకాశింపబడినపుడు, మనకు ఆలోచనలున్నవని తెలియుచున్నవి. మనమునసునందు, చింత, వ్యాకులత, సంతోషము కలుగునపుడు జ్ఞానజ్యోతి ప్రకాశము వాటిని ప్రకాశింపజేయుటవల్ల మనము తెలుసుకొను చున్నాము. సత్యకేంద్రమునకు అంతటి సమీపమున మనము నివసించుచున్నామనుట మనకు గోచరమగుట లేదు. మనహృదయమునందే పరమాత్మ వసించుచున్నాడు. అంత ప్రత్యక్షముగనుండుట వల్లనే మనము దానిని గ్రహించలేకున్నాము.

మన ఆలోచన ప్రవాహమును ప్రకాశింపజేయునది, చిత్ శక్తి. మన ఆలోచనల ప్రవాహము మనసు అనబడుచున్నది. మనసు ఆ ప్రకాశమువల్ల ఒక ఉనికి పొందుచున్నది. కనుక దానినుండి మనము పరమాత్మబింబమును చూడజాలము. ఆత్మ చైతన్యములోపలినుండి మనసును ప్రకాశింపజేయుచున్నది. ఆ ప్రకారము వెలుపలపడి, వ్యవహారములు చేయ సాధ్యమగుచున్నది. మనసు జ్ఞానేంద్రియముల సహాయమువల్ల ఆత్మకు అతి సమీపమునయుండగలుగుచున్నది. స్థూల శరీరము అంతటి సమీపమునకు వెళ్ళజాలదు.

కాని, మనము, ప్రపంచ వ్యవహారములయందు రుచి మరిగి, లోచూపు-జ్యోతుల జ్యోతి దృశ్యమును చూడ తిరస్కరించుచున్నాము. మన దృష్టి బహిర్ముఖమైయున్నది. స్థూలప్రాపంచక విషయసముదాయమునకే మనము గొప్పగౌరవము చూపుచున్నాము. ఆత్మ జ్యోతినివదలి దానికిరణలేశములు వీటిలో ప్రతిబింబించుట చూచుచున్నాము. ఒక నవీన శాస్త్రజ్ఞుడుగాని, ఒక పాశ్చాత్య తత్వవేత్తగాని, కొన్ని ప్రపంచక విషయముల రహస్యమును ప్రకటించినతోడనే వారిని మిక్కిలి కొనియాడుచున్నాము. ఒక ప్రతిబింబ కిరణమువల్ల అంతటి ప్రకాశము వెలువడగలిగినచో, ఆజ్యోతుల కేంద్రము, సత్యనిలయుని ప్రభావమెంత గొప్పదని కొనియాడవలసియున్నది!

## కేంద్రములకు కేంద్రము

యన్మనసా న మనుతే యేనాహు
ర్మనో మతమ్ ।
తదేవ బ్రహ్మ త్వం విద్ధి, నేదం య
దిద ముపాసతే ॥ 5

మనసు చేత యేది తెలియబడదో, దేనివలన మనసు తెలియుచున్నదో, అదియే బ్రహ్మము అని తెలియుము. ఇచట జనులు పూజించునది కాదు.

తన స్వరూపము తాను మరచిన దోషమువల్ల, అంతరంగ పరమాత్మ తన్ను యేదోయొక పరిమితి ఆవరించియున్నదను భ్రమకలిగియున్నాడు ఆత్మ మరుపే ఆవరణమనియు, భ్రమయే విక్షేపమనియు తెలుపబడుచున్నది. ఈ మనోబుద్ధుల లక్షణములగు ఆవరణవిక్షేపములతో తాదాత్మ్యము పొంది, మనసే శక్తివంతమనియు, బుద్ధి సామర్థ్యము గొప్పదనియు తలచుచున్నాము.

ఋషులు తీక్ష్ణవిచారము చేత, మానవుని ఔన్నత్యమును ఛేదించి, విమర్శించి సత్యమును కనుగొనిరి. మానవుని మానవత్వమును వస్త్రహీనము చేసి, అతనియందలి సూక్ష్మములను కనుగొనిరి. వారి పరిశ్రమవల్ల మానవుని మనసునకుగల శక్తి దాని స్వంతం కాదనియు, తెచ్చిపెట్టుకున్న సొత్తనియు కనుగొనిరి. మనసు అన్నమునుండికలిగినది. దానికి ఎట్టి శక్తియు లేదు. పరమాత్మ సన్నిధియందు వసించుటచేత దానికి శక్తియున్నదని కనబడుచున్నది.

ఇందు శిష్యుని దృష్టిని సామాన్యవ్యవహారమును వదలి ఊర్ధ్వముఖమై ఆత్మవైపు త్రిప్పుటముఖ్య ఉద్దేశము గానున్నది. ఆత్మ అధిష్టానమువల్లనే మనసు విషయ జ్ఞానమును పొందుచున్నది.

ఒక బల్బుకు ప్రకాశము లేదు. కరెంటు ప్రవహించినపుడు అది ప్రకాశించును. కరెంటు బల్బులోని తీగను ప్రకాశింపజేయును. ప్రకాశము కరెంటుకాదు. అటులనే మనసునందు శక్తి దానిదికాదు. ఆత్మ సంపర్కమువల్ల కలుగుచున్నది.

ఒక మోటారునడుపువాడు తన మోటారు క్రింద పడి అపాయముపొందను. అతడు బండిక్రిందపడవలె నన్న బండినుండి ముందు దిగవలె. అతడుదిగగనే బండి ఆగిపోవును. ఇకబండిక్రిందపడుట అభావము. అటులనే మనసు ఆత్మవైపు మరలినతోడనే రూపులేక పోవును. అనగా జడమగుచున్నది. దీపమునకు ముందుండు కుండవలెనుండును.

ఉపాసనకాలములో భక్తుడు తనమనోవృత్తిలో కనబడుబింబమునే పరమాత్మయని తలచుచున్నాడు. ఇది పొరబాటని ఉపనిషత్తు తెలుపుచున్నది. ఒక భక్తుడు తన ఆవేశమున, శ్రీరామునో కృష్ణునో, భగవంతునిగ చూచితినని తలచుచున్నాడు. ఇది కేవల మనో వృత్తి. బాహ్యమున సినిమాతారా చిత్రమును చూచువృత్తిగాని, ఆంతరమానచూచు ఇష్టదేవతా రూపముగాని, బింబములు, దృశ్యములు. సత్యస్వరూపములు కావు. ఏ శక్తి సహాయమువల్ల మనసు విషయములను గ్రహించుచున్నదో, ఏశక్తిసహాయము లేకున్న గ్రహించలేకున్నదో, అదియే బ్రహ్మమని తెలుసుకొనుము. ఇచ్చట దృశ్యములగు బింబములు కావు అని ఋషులు, ఈ మంత్రమున విశదపరచుచున్నారు.

ఇచ్చట ఋషులు నాస్తికత్వమును ప్రతిపాదించుటలేదు. ఉపాసన, పూజాక్రమములను నిరసించుటలేదు. పరిపక్వసాధకులు తమసాధన బురుదగంటలలోనే తగులుకొనియుండక వెలికివచ్చి ఉన్నత మార్గములను అనుసరించగలరని తాత్పర్యము. కనుక వారి మాటలు కఠినములు కావు.

మనలోనున్న జీవకళవల్లనే ఈ మనసు వ్యవహరించుచున్నట్లు కనబడుచున్నది. ఆశక్తివల్లనేదానికి ఉనికిఏర్పడినది. ఆశక్తియే అన్నిటియొక్క అంతర శక్తి. శక్తులకంతయుశక్తి. నన్ను నిన్ను, మీబిడ్డలను, మీ మనుషులను సర్వమును చైతన్యస్వరూపులు జేయు శక్తి. అదియే పరిపూర్ణ సత్యపరబ్రహ్మము.

మనసనగా ఆలోచనల పరంపర. ఈ పరంపరను అడ్డగించి ఆపివేసిన ఈ మనసుకు ఆధారముగానుండు శక్తి యొక్క జ్ఞానము మనకు లభించును. ఈ ఆలోచనల అరికట్టుట, నిత్యనిరంతర జపధ్యానములవల్ల సాధ్యమగుచున్నది. మన ఆలోచనవలను సన్నగించి, జపమున నిమగ్నము చేసిన యెడల మనగుణములుకూడ మారుచున్నవి.

మన ఆలోచనల రీతి మనము వ్యవహరించుచున్నాము. మనతలంపులకు అనుగుణముగ ప్రకటితమగుచున్నాము ఉన్నత ఆలోచనలవల్ల, ఉన్నత పదవిని పొందగలము.

కనుక, జపము, ధ్యానము, మన ఆలోచనలను క్షీణింపచేసి, మనగుణములను పరివర్తనము చేయుచున్నవి. సాధనవల్ల, మనసు ఆనందరూపమున నిలువగలుగుచున్నది. భగవంతునియందు నిలువగలుగుచున్నది. ధ్యానాభ్యాస పరిపక్వమువల్ల ఆ భగవంతుని సర్వాంగ సౌందర్యమున నిలకడగాంచి, అతని చిరునవ్వున లీనమగుచున్నది. కడకు ఈ చిరునవ్వును ముఖావలోకనమును వదలుకొని, రూపరహిత శుద్ధ ఆనంద బ్రహ్మమున లయమగుచున్నది. ఇట్టి అనుభవపరిపక్వము కలుగుటవల్ల, ఆఆనందము తన అంతరమున, బాహ్యమునకూడ ఆవరించియుండుటను అనుభవించును. అట్టి దశలో, బ్రహ్మోఽహం. శివోఽహం. అని కేకలు వేయుచున్నాడు.

సాధకుని గమ్యస్థానము పరిపూర్ణ ఆనందసత్యస్వరూపము. అందుకు వేదాంతము మార్గము చూపుచున్నది. వేదాంతము సర్వప్రాపంచక మతము. దానివల్ల హిందువుడు ఉన్నత హిందువగుచున్నాడు. క్రీస్తువు ఉన్నత క్రైస్తవుడగుచున్నాడు. మహమ్మదీయుడు ఉన్నత మహమ్మదీయుడగును. అంతర విచారము జరుగుకొలది, మన నిజస్వరూపము పూర్ణానందము అని తెలియగలదు. ఆ భగవంతుని శరణుజొచ్చి, అతడే మనలోని నిజ ఆత్మ స్వరూపమని తెలుసుకొందముగాక, అట్టి ఆత్మను తెలుసుకొనిన యెడల అన్ని దేవతలను తెలిసిన వారమగుదుము. అన్ని అవతారపురుషులను అన్నిమహాత్ములను కనుగొనిన వారమగుదుము. (సశేషము)

# కృతజ్ఞతాశ్రుధారలు

శ్రీ యం. వేంకట రత్నమయ్య



ధరముచ్చుకోటలో గరణాలయింట
చిరకాలముగ నుండి చెలగితివమ్మ
మూసిన గన్నులు మూసినట్లుండ
మోసగించిన రీతి మోక్షమందితివి
అక్కటా నినువంటి యనుఁగుజెల్లెలిని
నెక్కడగాంతు నా కెయ్యది తోడు
పసుపు గుంకుమమును దాసినదాది
మసలక తమ్ముని మూడ్కి భారంబు
వహియించి యిలుదీర్చి పలుకష్టములను
సహియించి చెల్లెలా సంతరించితివి
అడుతోజేమిలే యని పలుకంగ
గూడునె: యన్నిట గూర్చుతమ్ముడవు
అన్నపై నీకున్న యాప్రియమెంతొ
ఎన్నగనేదప్ప నెవరికి దరమె
నీవుచేయించిన నేర్పగు పనులు
నీవటనుండగా నేజూడనైతి
ఏడాది కొకసారి యేపనులున్న
వేడుక ననుజూచి వెళ్లుచుండితివి
కడసారి మాటలు గలుగనీ కుండ
పుడమి వీడితివమ్మ కడచూపులేక
ఎట్లోర్చితివో గాలి యెండల కీవు
పుట్లాది ధాన్యంబు పండించినావు
పండిన ధాన్యంబుఁ బాతర్లఁబోసి
దండిగా కూలీలఁ దప్పక బిలిచి
వాగుపారుచునేల వడిగోయుచుండ
బాగనియొక కట్ట భద్రంబుగాగ
గాడి బావికడను ఘనులు నిన్మెచ్చ
వేడుక గట్టించి వెలసితి వీవు
ఇంజనీర్లెందుకు నిమెముండనగ
బంజరు భూమిని పుంజ జేసితివి
చాలరైతులు నిన్ను శ్లాఘించుచుండ
చాలగావిని మది సంతసించితిని
ఇతర ధాన్యము నమ్మియెప్పటికపుడె
అతిరయంబునడబ్బు నంపితివీవు
ఊరికిముందుకోనేరు త్రవ్వించి
పేరు గాంచితివమ్మ పెంపుచెన్నార
కొండపై గుడిపూజ గోరికఁజరిపి
దండిగా రామేశు దయగాంచినావు
గోత్రాలచేలలో గోర్కినాపితివి
బిత్రగుపెనునట్టు వెడలించినావు
బాటవెంటనువచ్చి పశువులు పైర్ల
నోటవేసుకబోక పాటిగాదనుచు
గట్టిరాలను గోడ కంచగానుండ
గట్టించితివినీవు కడుసంభ్రమమున
ధర్మజుయాగంబు దప్పకనడువ
ధర్మజు తమ్ముండు ధనముచేకూర్చె
ఆరీతిగాను ని వారసిధనము
కోరి బంపితివమ్మ కూరిమిమీర
కర్నూలులో నాంధ్ర గ్రంథాలయంబు
నిర్ణీతవేళల నియతితో నడుప
ఇకమీద నెవ్వరు ఇటుబంపువారు
ఇకమీద సేద్యంబు నెవరుసేయింత్రు

ఏమితోచదునాకు నెట్లగునొక్క-
భూముల నేర్పుతో బోషింతురెవరు
ఇచ్చిన అప్పేమొ ఇకరాదటంచు
అచ్చుగానసువులు నటుబాసితేమొ
ఒక్కటనింటిలో నొకట పొలాన
ఒక్కొక్కరు గమది సులుకులేకుండ
కార్పణ్యమున దురాక్రమణకుంబూన
నేర్పడ వారితో నెదురాడలేక
సామంబుతో వాని సాధించలేక
భూమినండగలేక పోయితివేమొ
ఎందాక నీపను లిలపైనవెలయు
నందాక స్వర్గంబునందు సౌఖ్యంబు
నందుచు నుండంగ నఖిలేశ్వరుండు
పొందిక నిన్నటం బ్రోచెడుగాక
ఇదెనాదుదీవెన ఇదెనాదుప్రేమ
అదెచూడు నేనిచ్చు నశ్రుధారలను
ధర్మోదకంబులం దగనందుకొనుచు
నిర్మలమతినుండు నీవు స్వర్గమున ॥

# భూమి, దాని పుట్టు పూర్వోత్తరాలు

శ్రీ ఎస్. కబుజెంకో

భూమి యే విధంగా పుట్టిందో తెలుసుకోవాలన్న జిజ్ఞాస మానవజాతికి ప్రాచీన కాలంనుండీ ఉంటు న్నది. భూగోళశాస్త్రం, గణిత శాస్త్రం, పదార్థ విజ్ఞాన శాస్త్రం మొదలైనవి ఇంకా ప్రాథమిక దశలో ఉన్నప్పుడు విజ్ఞాన శాస్త్రవేత్తలు, ఇతర మేధావులు కూడా భూమిని భగవత్ సృష్టిగా భావిస్తుండేవారు. పద్దెనిమిదవ శతాబ్దంలో మాత్రమే భూమి పుట్టు పూర్వోత్తరాలకు సంబంధించిన వైజ్ఞానిక సిద్ధాంతాలు రూపొందాయి. ప్రకృతి మారడం అసాధ్యమనే భావాలు సడలుతూ, ప్రపంచం మార్పు పైన ఆధార పడి అభివృద్ధిని పొందుతుందన్న నూతన వైజ్ఞానిక భావాలు యేర్పడుతున్న సమయమది. దైవిక శక్తుల ప్రమేయం లేకుండానే ప్రకృతి పరిణామాన్ని పొందు తుందన్న వాదం ప్రథమంగా భూమి దాని పుట్టు పూర్వో త్తరాలను గురించి కేంట్ - లప్లసీలు చేసిన సిద్ధాం తంలో వ్యక్తమయింది.

## కేంట్ లప్లసీ సిద్ధాంతం

కేంట్ - లప్లసీ సిద్ధాంతం ప్రకారం ఇప్పటి సౌర కుటుంబం జ్వలిస్తున్న ఒక వాయుపూరిత నీహారిక (నెబ్యూలా) నుండి ఉద్భవించింది. ఈ నీహారిక సూర్యమండలం చుట్టూ పరిభ్రమిస్తూ నింపాదిగా చల్ల బడి ముకిళించుకొని పోవసాగింది. తత్ఫలితంగా దాని పరిభ్రమణ వేగం అధికమయింది. ఈ విధంగా వేగం అధికమైన స్థితిలో ఆ వాయువు ఒకొక్కచోట కూడిక అయి చల్లబడి గ్రహాలు రూపొందాయి.

ఈ విధంగా యేర్పడిన గ్రహాలు ఒకే సమతలంలో వలయాకారపు కక్ష్యలో ఒకే మార్గంలో పరిభ్రమించ వలసి ఉంటుంది. సౌరకుటుంబానికి చెందిన గ్రహాలు యే విధంగా పరిభ్రమిస్తుంటాయో అందరికి తెలిసిన విషయమే. కేంట్ - లప్లసీ సిద్ధాంతం భూమి, ఇతర గ్రహాలయొక్క గమనానికి సంబంధించిన ప్రాథమిక లక్షణాలకు యీ విధంగా అర్థం చెబుతూ వచ్చింది.

కాని కేంట్ - లప్లసీ సిద్ధాంతం, చారిత్రక దృష్ట్యా చూచినట్లయితే అది పద్దెనిమిదవ శతాబ్దపు విజ్ఞాన శాస్త్రపు స్థాయికి మాత్రమే పరిమితమై ఉన్నది. ఆనాటికి గ్రహాలను సంబంధించిన లక్షణాలను గురించి మనకు యెక్కువగా తెలియదు. పదార్థ విజ్ఞానశాస్త్రం అంతగా అభివృద్ధిని పొందలేదు. పదార్థ విజ్ఞాన శాస్త్రం, రసాయనిక శాస్త్రం, ఖగోళ శాస్త్రం, భూగర్భశాస్త్రం, మొదలైనవి అత్యంతంగా అభివృద్ధిని పొందిన పందొమ్మిదవ శతాబ్దంలో కేంట్ – లప్లసీ సిద్ధాంతం అసంపూర్ణమయినదనీ, సమర్థించుటకు సాధ్యముకానిదనీ నిరూపణ అయింది. ఈ సిద్ధాంతం ప్రకారం వివిధ గ్రహాల ఉపగ్రహాలు యెందువల్ల తమచుట్టు తాము గ్రహాలు తిరిగే మార్గానికి వ్యతిరిక్త మైన మార్గంలో తిరుగుతున్నాయో, సూర్యమండలం యెందువల్ల తక్కువ వేగంతో కదులుతున్నదో చెప్పడం కష్టమయి పోతుంది. ఇరవయ్యోశతాబ్దారం భానికల్లా కేంట్ - లప్లసీ సిద్ధాంతంలోని లోపాలు ప్రస్ఫుటం కాజొచ్చాయి.

## జీన్ యొక్క జగదుత్పత్తి సిద్ధాంతం.

ఈ శతాబ్దం మూడవ దశకంలో జీన్ యొక్క జగదుత్పత్తి సిద్ధాంతం విస్తృతంగా ప్రచారంలోకి వచ్చింది. ఈ సిద్ధాంతం ప్రకారం ఇప్పుడు గ్రహా లుగా రూపొందిన పదార్థము, ఒకానొక నక్షత్రం సూర్య మండలం సమీపంనుంచి పయనించిన సందర్భంలో ఆ నక్షత్రపు ఆకర్షణశక్తి మూలంగా సూర్యమండలంనుండి బయటికి లాగబడింది. సరియైన వైజ్ఞానిక పునాది లేకపోవడంవల్ల యీ సిద్ధాంతం విమర్శలకు నిలబడలేక పోయింది. సౌర కుటుంబపు బ్రహ్మాండమైన పరిమాణం దృష్ట్యా జీన్ యొక్క సిద్ధాంతం యే విధంగా సమర్థింపరాని దవుతుందో అమెరికన్ ఖగోళ శాస్త్రజ్ఞుడు రసెల్, సోవియెట్ విజ్ఞాన శాస్త్రవేత్త ఎస్. ఎన్. పరిస్కీ నిరూపిం

చారు. ఈ విధంగా విశ్వసృష్టికి సంబంధించిన సిద్ధాంతాలు ఒక్కొక్కటే పూర్వపక్షం అయిన తర్వాత ప్రఖ్యాత గణిత శాస్త్రజ్ఞుడయిన ఎకడమీషియన్ ఒ. వై. స్మిత్ నాయకత్వంలో ఒక సోవియట్ విజ్ఞాన శాస్త్రవేత్తలజట్టు భూమి, తదితర గ్రహాల పుట్టు పూర్వోత్తరాలను గురించి మరొక కొత్త సిద్ధాంతాన్ని రూపొందించింది.

## స్మిత్ యొక్క నూతన సిద్ధాంతం

స్మిత్ సిద్ధాంతం ప్రకారం పలుచనైన వాయువు, దుమ్ము కణాలతో కూడిన పదార్థం నుండి ఇప్పటి గ్రహాలు రూపొందాయి. ఘన రూపంలోనున్న దుమ్ము కణాలు గ్రహాల సృష్టిలో ప్రముఖ పాత్రను వహించాయి. మొదటి విషయం యేమిటంటే వాయువు ఘనీభవిస్తూ యీ దుమ్ముకణాల చుట్టూ పేర్కొనసాగింది. రెండవ విషయం యేమిటంటే, ఆ కణాలు ఒకదానితో మరొకటి కొట్టుకొనడంవల్ల వాటిలోని శక్తిలో కొంతభాగం ఉష్ణంగామారి రోదసిలోకి ప్రసారం కావడం జరిగింది. ఈ విధంగా మెకానికల్ శక్తి ఉష్ణ శక్తిగామారే ప్రక్రియ వాయువు, దుమ్ముతో కూడిన మబ్బులనుండి గ్రహాలు రూపొందడానికి తోడ్పడింది. ఈ విషయాన్నే స్మిత్, ఎ. ఐ. లెబిదిన్స్కి, తదితర సోవియట్ విజ్ఞాన శాస్త్రవేత్తలు తమ సిద్ధాంతంలో నిరూపించారు. మెకానికల్ శక్తి ఉష్ణశక్తిలోనికి మారడానికి సంబంధించిన గణనద్వారా గ్రహాలు యే విధంగా రూపొందాయో తెలుసుకొనడమేగాక, అలాయేర్పడిన గ్రహాలు ఒకదానికి మరొకటి యెంత దూరంలో ఉండగలవో లెక్క కట్టడంకూడా సైద్ధాంతికంగా సాధ్యమయింది. ఈ విధంగా స్మిత్ సైద్ధాంతికంగా లెక్కగట్టిన దూరాలు, పరిశీలనల ద్వారా సేకరింపబడిన సమాచారం ద్వారా ధృవపడ్డాయి.

మెకానికల్ శక్తి ఉష్ణశక్తిగా మారడంవల్ల కలిగే ప్రభావం మూలంగా గ్రహాలు యిప్పటి విధంగా తమ చుట్టూ తిరుగుతూ సూర్యుని చుట్టూ పరిభ్రమిస్తున్నాయని స్మిత్ కట్టిన లెక్కలు నిరూపిస్తున్నాయి. ఉపగ్రహాలు యేర్పడి గ్రహాలు తమ చుట్టుతాము తిరిగే మార్గానికి వ్యతిరేకమైన మార్గంలో తమచుట్టు తాము యెందువల్ల తిరుగుతున్నాయన్న విషయాన్నికూడా యీ సిద్ధాంతం వివరిస్తుంది. ఉపగ్రహాల విషయంలో, గ్రహాలను అత్యంత దూరమైన స్థాయిలో మెకానికల్ శక్తిలో కొద్దిభాగం మాత్రమే ఉష్ణ శక్తిగా మారడంవల్ల అవి, గ్రహాలు తమ చుట్టు తాముతిరిగే మార్గానికి వ్యతిరిక్తమైన మార్గంలో తమ చుట్టు తాము తిరగడం జరుగుతుంది.

## స్మిత్ సిద్ధాంత వివరణ

గ్రహాలలో వాటి కదలికలు, ఇతర లక్షణాల విషయంలో సామ్యతలు ఉన్నట్లుగానే కొన్ని విభిన్నతలుగూడా ఉన్నాయి. గ్రహాలు రెండు గ్రూపులక్రింద విభజింపబడి ఉన్నాయి. భూమికి సూర్యమండలానికీ మధ్యఉండే గ్రహాలు ఒక గ్రూపుకి చెందినవి. ఇందులో బుధగ్రహం, శుక్రగ్రహం, భూమి, అంగారక గ్రహం వస్తాయి. భూమికి అవతలగా సూర్యుని సుదూరాన ఉన్న బృహస్పతి, నెప్ట్యూన్, వరుణ, ప్లూటో గ్రహాలు రెండవ గ్రూపులోకి వస్తాయి. భూమికి సూర్యమండలానికీ మధ్య ఉండే గ్రహాలు, భూమి, రెండవ గ్రూపు గ్రహాలకంటే చిన్నవిగానూ, అత్యధికమైన సాంద్రతను కలవిగాను ఉన్నవి. గ్రహాలు వివిధంగా, విభిన్న పరిస్థితుల్లో రూపొందాయని పై విషయాలవల్ల వ్యక్తమవుతుంది. సూర్యమండలపు సామీప్యత, సుదూర స్థితిగూడా గ్రహాలు రూపొందడంపైనా, వాటి కూడికపైన గొప్ప ప్రభావాన్ని కలుగజేయడం జరిగిందని స్మిత్ సిద్ధాంతం నిరూపించింది.

## భూమండలం యొక్క వయస్సు

ఇరవయ్యవ శతాబ్దంలో, రేడియో ఏక్టివ్ వస్తువులు కనుగొనబడి, పరిశోధనలు కొనసాగిన తర్వాతనే భూమండలంయొక్క వయసును కొంతవరకు సరిగ్గా అంచనా వేయడం జరిగింది. రేడియో ఏక్టివ్ వస్తువులు, వివిధ ఖనిజాలలోఉన్న వాటి అవశేషాల మొత్తాన్ని

అంచానా కట్టడంద్వారా విజ్ఞాన శాస్త్రవేత్తలు భూమండలపు పైభాగం 3,000 మిలియన్ల నుండి 5,000 మిలియన్ల సంవత్సరాలనాటిదన్న నిర్ణయానికి వచ్చారు. భూమండలపు పదార్థంయొక్క వయస్సును నిర్ణయించేందుకు విజ్ఞానశాస్త్రవేత్తలు యురేనియం పైన పరిశోధనలను కొనసాగించారు. ఈ మూల పదార్థం రెండు ఐసోటోపులను — 235 అణు భారం గల ఒక ఐసోటోపును, 238 అణు భారంగల మరొక ఐసోటోపును — కలిగి ఉంటుందని అందరికీ తెలుసును. ఈ ఐసోటోపులు రేడియో ధార్మిక శక్తిని కలిగి ఉంటాయి. కాని వాటి అర్ధ - జీవిత కాలపరిమితి విభిన్నంగా ఉంటుంది. యురేనియం యేర్పడిన కాలంలో యీ రెండు ఐసోటోపులు సమంగానే విలీనమై ఉండవచ్చును. కాని ఇప్పుడు అలా లేవు. ఈ సమాచారాన్నిబట్టి భూమండలపు పదార్థమంతా 5,000 మిలియన్లు లేదా 7,000 మిలియన్ల సంవత్సరాల క్రితం మేర్పడిందన్న నిర్ణయానికి రావడం జరిగింది. వాయువు, దుమ్ముతో కూడిన మబ్బునుండి భూమి యేర్పడడానికి యెంతకాలం పట్టి ఉంటుందో స్మిత్ తోకూడా అంచనా కట్టాడు. దాని ప్రకారం భూమియొక్క పైభాగం 5,000 మిలియన్ల నుండి 6,000 మిలియన్ల సంవత్సరాలమధ్య యేర్పడి ఉండాలి. ఈ విధంగా రెండు అంచనాలు దాదాపుగా ఒకటిగానే ఉంటున్నాయి.

భూమి దాని పుట్టు పూర్వోత్తరాలను గురించి విజ్ఞానశాస్త్రం పై విధంగా తెలియజేస్తున్నది. ఇప్పుడు భూమండలంగాఉన్న పదార్థం దాదాపు 6,000 మిలియన్ సంవత్సరాలక్రితం యేర్పడింది. కొన్ని వందల కొలది మిలియన్ల సంవత్సరాల కాలంక్రితం సూర్యమండలానికి సమీపంలో వాయువు, దుమ్ముతో కూడిన మబ్బు యేర్పడి, అది క్రమంగా చల్లబడుతూ వచ్చి యీ విధంగా గ్రహాలు యేర్పడ్డాయి. అటు తర్వాత చల్లబడిఉన్న భూమండలం రేడియో ఏక్టివ్ మూల పదార్థాల క్షీణింపువల్ల విడుదల అయిన ఉష్ణం మూలంగా వేడెక్క సాగింది. బ్రహ్మాండమైన పరిణామాన్ని కలిగిఉన్న భూమండలం యేర్పడిన తర్వాతనే రేడియో ఎక్టివ్ ఉష్ణం కూడడం ప్రారంభమయింది. భూమండలపు అంతర్భాగం నేటికిగూడా వేడెక్కుతునే ఉన్నది. ఈ విధంగా భూమి వేడెక్కడం మొదలైన ప్రాథమిక దశలో వాతావరణం, జలావరణం (హైడ్రోస్ఫియర్) యేర్పడ్డాయి.

గ్రహాల ఉత్పన్నానికి కారణభూతమయిన వాయువు దుమ్ముతో కూడిన మబ్బు యేవిధంగా యేర్పడిందన్న విషయానికి సమాధానం చెప్పడం చాలా కష్టం. ఎందువల్లనంటే అది ఇంకా చాలా కాలంక్రితానికి సంబంధించిన విషయం. అంతేగాక అది సూర్యమండలం, నక్షత్రాల పుట్టు పూర్వోత్తరాలతో సన్నిహిత సంబంధం కలిగిఉన్న విషయం. అంతేగాక అది సూర్యమండలం, నక్షత్రాల పుట్టు పూర్వోత్తరాలతో సన్నిహిత సంబంధం కలిగిఉన్న విషయం. సూర్యమండలం నక్షత్రాల మధ్యఉన్న వాయువు దుమ్ముతో కూడిన మేఘాలలోంచి పయనిస్తూ ఉండగా గ్రహాల ఉత్పన్నానికి కారణభూతమైన ఆ మేఘాన్ని కూడదీసుకొన్నదని స్మిత్ సిద్ధాంతీకరించాడు. సూర్యమండలం తక్కువ వేగంతో తన చుట్టు తాను తిరగడానికి కారణాన్నిగూడా యీ సిద్ధాంతం వ్యక్తం చేస్తుంది.

గ్రహాల పుట్టు పూర్వోత్తరాలను గురించి సోవియట్ విజ్ఞాన శాస్త్రవేత్తలు భూసిద్ధాంతాన్ని రూపొందించడం ద్వారా విశ్వోత్పత్తి శాస్త్రానికి అత్యంతంగా దోహదం చేసారు. ఈ సిద్ధాంతము గ్రహాలు, వాటి లక్షణాలకు సంబంధించిన అనేక విషయాలకు కారణాలను తెలుపుతుంది. ప్రపంచమంతటాఉన్న ఖగోళ శాస్త్రజ్ఞులు, భూగర్భ శాస్త్రజ్ఞులు భూబౌతిక శాస్త్రజ్ఞులు యీ సిద్ధాంతాన్ని అంగీకరిస్తున్నారు.

నాటిక :

# అన్వేషణ

— శ్రీ నాయుడు వెంకట సీతారామమూర్తి

పాత్రలు :- సరోజ
సుబ్బారావు
సత్యం

(మద్రాసు మెయిల్‌లో థర్డు క్లాసు కంపార్టు మెంటు. సుబ్బారావు పత్రిక చదువుతూ ఉంటాడు. ప్రక్కనే మరికొన్ని పత్రికలు ఉంటాయి.)

సరోజ :- మిష్టర్ !

సుబ్బారావు :-(మాట్లాడడు)

స:- మిమ్మల్నే !

సు :- పిలచేరా ?

స :-ఆ డిటెక్టివ్ నవల ఓసారిస్తారా ?

సు :-(పుస్తకం చేతికి అందిస్తాడు)

(కొంతసేపు నిశ్శబ్దం)

స :-(చదువుతూ) యివేం డిటెక్టివ్ కథలండీ! ఎన్ని చదివినా ఒకేలా ఉంటాయి!

సు :-ఈ మధ్య వెలువడేడిటెక్టివ్ సాహిత్యం యింతేలెండి. ప్లాటు పాతదైనా పేరు మార్చి మరో కొత్త నవలలా పబ్లిష్ చేస్తున్నారు.

(మెయిల్ ఓ స్టేషనులో ఆగుతుంది)

సు :-ఎంతవరకు వెళ్తున్నారు ?

స :-మద్రాసు

సు :-నేనూ మద్రాసే

స :-యింకనేం - యిద్దరం ఒకే చోటికి పోతున్నాం.

సు :-మీకెవరైనా బంధువులున్నారా మద్రాసులో ?

స :-లేరు. మీకో ?

సు :-నాకూ లేరు.

స :-సరిపోయింది. అయితే ఎక్కడ మకాం చేద్దామనుకుంటున్నారు ?

సు :-హోటల్‌లో రూము తీసుకోవాలి.

స :-మీ పేరు ?

సు :-సుబ్బారావు.

స :-నాపేరు సరోజ

సు :-బాగుంది. ఈ వివరాలన్నీ మీకు అవసరమా ?

స :-అబ్బే! ఏదో కాలక్షేపానికి లెండి.

సు :-అయితే కానివ్వండి. మీరెక్కడ నుంచి వస్తున్నారు ?

సరో :-విజయవాడ స్టేషనులో ఎక్కేటప్పుడు మీరు చూశారుగా.

సు :-నేను వైజాగునుంచి వస్తున్నాను.

స :-ఏదో పనిమీదే వస్తున్నట్టున్నారు ?

సు :-ఏమీ లేదు.

స :-బాగుంది, ఏ పనీ లేకుండా ప్రయాణాలా ?

సు :-యింటివద్ద ఏమీ తోచకపోతే షికారు తిరిగి వద్దామని...

స :-విచిత్రంగా ఉందే! షికారు కోసం దూరప్రయాణాలా? డబ్బుఖర్చు కాదూ?

సు :-ఇదీ ఓ ఖర్చేనా? అసలు డబ్బెలా ఖర్చు చేయాలో నేనింకా నేర్చుకో లేదు.

స :-బాగానే ఉంది. మీ ఊళ్ళో ఉంటే మీకు విశ్రాంతి లేదా?

సు :-ఉంది. కానీ సరిపోదు. అందుకనే ఈ ప్రయాణం.

స :-ఎన్నాళ్ళో ఈ ప్రయాణం?

సు :-చెప్పలేను.

(మెయిల్ మద్రాసు స్టేషనులో ఆగుతుంది- యిద్దరూ దిగుతారు)

సు :-ఏయ్! టాక్సీ!

స :-మీరు టాక్సీలో పోతారా?

సు :-అవును-మీరెక్కడికి వెళ్తారు!

స :-అదేం తోచడంలేదు. నాకు మద్రాసు కొత్త.

సు :-ఎరుగున్నవారెవరైనా ఉన్నారా?

స :-లేరు.

సు :-స్నేహితులు?

స :-ఊఁహూఁ.

సు :-అయితే ఎక్కడ మకాం చేస్తారు?

స : మీరూ?

సు :-నేను దశప్రకాష్‌లో దిగుతాను.

స :-నేనూ అక్కడికే వస్తాను.

సు :-సరే పదండి - ఇద్దరం టాక్సీలో పోదాం.

(ఇద్దరూ టాక్సీ ఎక్కుతారు - హోటల్ చేరుకుని అక్కడ రూము తీసుకుంటారు)

స :-చాలా థేంక్సు. మీరే లేకపోతే నాకు మద్రాసంతా అయోమయంగాఉండేది.

సు :-దానికేంలెండి. మీరుకూడా ప్రత్యేకంగా ఓ రూము తీసుకోకూడదూ?

స :-చంపేశారు - ఇంక ఖాళీ లేవన్నాడే. మీకు అభ్యంతరం లేకపోతే ఈ రూములోనే ఉంటాను.

సు -(సంకోచిస్తూ) ఇక్కడా!

స :-ఇష్టంలేకపోతే ఇంకో హోటల్‌కి వెళ్ళిపోతానులెండి.

సు :-వెళ్ళి మంచి రూము తీసుకోండి.

స :-(బిక్క ముఖంతో) ఇంతేనా! నాకు మీ రొక్కరే పరిచయస్తులు. నాకు మద్రాసు కొత్తగా!

సు :-మీరేమైనా చదువుకున్నారా?

స :-ఆ.

సు :-ఎంతవరకు?

స : బి. ఏ.

సు :-అందుకే ఈ చిక్కు.

స :-ఎందుకు?

సు :-మీరెన్నాళ్ళుంటారిక్కడ?

స :-పని పూర్తయ్యేవరకూ

సు :-అదే ఎప్పటికి పూర్తవుతుందని?

స :-ఇంతట్లో చెప్పడం కష్టం

సు :-గట్టిచిక్కే - ఇంతకూ మీకు ఇక్కణ్ణుంచి కదిలేవాటం లేదన్నమాట.

స:-అన్నమాటే
సు:-పోలీసుల్ని పిలవవలసి వస్తుంది.
స:-మీరుండగా నాకు భయంలేదు.
సు:-మొండితనం బాగా అబ్బింది.
స:-మీకంటేనా?
సు:-సరే ఉండండి. ఎన్నాళ్లు ఉండగలుగుతారో చూస్తాను.

(భోజనాల అనంతరం)

స:-మీ ప్రవర్తన చాలా విచిత్రంగాఉంది. మీ చరిత్ర తెల్సుకోవాలని కుతూహలంగా ఉంది. చెప్పండి?
సు:-చెప్పదల్చుకోలేదు.
స:-ఎందుకని?
సు:-ఇష్టంలేదు గనుక!
స:-చెప్తే అరిగిపోతారా?
సు:-అరిగిపోడానికి రాచ్చిప్ప కాదు.
స:-తండ్రిమీద కోపగించేరా?
సు:-అవును - అరేరే! చెప్పేశానే!
స:-ఎందుకనో?
సు:-అభిప్రాయ భేదాలవల్ల.
స:-డబ్బు విషయంలోనా?
సు:-కాదు. పెళ్ళి విషయంలో-యింక అడక్కండినన్ను.
స:-చెప్తే విషయం పూర్తిగా చెప్పండి మరి. ఎందుకు కోపగించేరు?
సు:-అబ్బబ్బా! చంపుతున్నారు
స:-చెప్పాలిమరి, ప్లీజ్!
సు:-నాక్కో సంబంధాన్ని తీసుకువచ్చేడు మా నాన్న - చేసుకోమన్నాడు.
స:-మీరేమన్నారు?
సు:-చేసుకోనన్నాను.
స:-అమ్మాయి నచ్చలేదా మీకు?
సు:-చూడలేదుగా నేను!
స:-చూడకుండానే నిరాకరించేరా?
సు:-ఇప్పట్లో పెళ్ళే వద్దన్నాను.
స:- ఏం!
సు:-ఇష్టంలేదు గనుక.
స:-అసలు పెళ్లంటూ చేసుకుంటే ఆ అమ్మాయిని చేసుకుంటారా?
సు:-ఇప్పుడు చెప్పలేను.
స:-నాలాంటి అందమైన అమ్మాయి వచ్చి అడిగితే?
సు:-మీరు అందంగా ఉన్నట్టు నేననుకోవడంలేదు.
స:-నిజంగా నేను అందంగాలేనా?
సు:-చిలిపితనంగా ఉన్నారు.
స:-తర్వాత ఏం జరిగిందో చెప్పండి?
సు:-అమ్మాయిని చూడ్డానికి వెళ్లమన్నాడు. వెళ్లనన్నాను. కొన్నిరోజులు ఎక్కడికైనా పోదామని యిలా వచ్చేశాను.
స:-మీకు అమ్మాయిలంటే భయమా?
సు:-భయమయితే మీరు నా రూములో ఎందుకు ఉండగల్గుతారు?
స:-అచ్చంగా నా కథలాగే ఉంది మీ కథ.

సు:-మీదీ నా కథలాంటిదే?
స:-కానీ కొద్ది కొద్ది మార్పులతో
సు:-వినిపించండి మరి
స:-నాకూడా ఒక సంబంధాన్ని తీసుకు వచ్చేడు మా నాన్న.
సు:-అబ్బాయిని చూశారా?
స:-ఫోటో చూశాను.
సు:-నచ్చాడా?
స:-అది వేరేసంగతి
సు:-చేసుకో పోయారా పెళ్ళి!
స:-వీల్లేకపోయింది.
సు:- ఎందుకని?
స:-అబ్బాయి పారిపోయాడు.
సు:-వెతుక్కుంటూ మద్రాసు వచ్చారా?
స:-వచ్చి మిమ్మల్ని కలుసుకున్నాను.
సు-మీ కథకూ నా కథకూ తేడా ఉందే?
స:-తేడా ఉన్నా రెండుకథలూ కలిస్తే ఒక కథ పూర్తవుతుంది. ఇంతకూమిమ్మల్ని ఓ విషయం అడగాలనుకుంటున్నాను.
సు:-నిర్భయంగా అడగవచ్చు.
స:-నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను.
సు:-ప్రేమించుకోండి.
సరో:-మీరూ ప్రేమించాలి.
సు:-అది నా వల్లకాదు.
స:-పెళ్లికూడా చేసుకోబోతున్నాను.
సు:-చంపేశారు
స:-భయపడ్డారా?
సు:-లేదు కంగారు పడ్డాను.
స:-నిరాకరిస్తారా?
సు:-ఆలోచిస్తాను
స:-బాగా ఆలోచించండి మరి
సు:-రామేశ్వరం వెళ్లినా రాద్ధాంతం తప్పదన్నట్లు పెళ్లిగొడవ వదుల్చుకోడానికి మద్రాసు వచ్చినా మీ గొడవ తప్పలేదే!
స:-మద్రాసేకాదు మహారణ్యంలోకి పోయినా మీకీ గొడవ తప్పదు.

(మరో రోజు పూల తోటలో)

స:-వసంతం వచ్చింది
సు:-వచ్చింది.
స:-చెట్లు చిగిర్చేయి
సు:-చిగిర్చేయి
స:-నా హృదయం వికసించింది
సు:-నా హృదయం మామూలుగానే ఉంది
స:-మన్మథబాణాలు నా హృదయాన్ని గుచ్చుకుంటున్నాయి.
సు:-త్వరగా లాగి పారెయ్యండి. లేకపోతే దెబ్బతింటారు.
స:-ప్రియా?
సు.-ఎవర్ని?
స:-మిమ్మల్నే!
సు:-చంపేశారు
స:-అలా బెదిరిపోతారేం?
సు:-నాకా బెదురు?

స:-బెదురు కనుకనే యిస్తామన్న పిల్లను చూడకుండా వచ్చేశారు.

సు:-పోనీ నిన్ను చూశానుగా చేసుకుంటానులే పెళ్ళి.

స:-నిజంగా!

సు:-నిజంగానే!

స:-చాలా అదృష్టవంతురాల్ని నేను

సు:-నేనుకాదా?

స:-మళ్లీ మనసు మారదుకదా?

సు:-మారదు

స:-అయితే పదండి యింటికి పోదాం

సు:-చంపేవుపో! ఎవరింటికి?

స:-మా యింటికి

సు:-ఎందుకు?

స: పెళ్లికూతుర్ని చూడ్డానికి

సు: మళ్లీ యింకో పెళ్లి కూతురా!

స:-మీకు తెలీదులెండి

(హడావిడిగా సత్యం ప్రవేశం)

సత్యం:-యిక్కడున్నావట్రా! నీ కోసం తిరిగి తిరిగి చస్తున్నాను.

సు:-నాన్నా!

స:-పోనీలే యిప్పటికైనా దొరికేవు (సరోజను చూసి ఆశ్చర్యంగా) అయితే పెళ్లికూతురుని వెంటతీసుకువచ్చేవన్న మాట!

సు:-పెళ్లికూతురెవరు?

స:-వెంకట్రావుగారమ్మాయి సరోజ -. ఈ అమ్మాయినేగా నిన్ను చూశి రమ్మన్నాను!

సు:-సరోజ వెంకట్రావుగారమ్మాయా?

సత్యం:-ఇంకా పెళ్లికాకుండానే సర్కట్లు మొదలు పెట్టేరన్న మాట.

సు:-నాకేం తెలీదునాన్నా!

స:-నాకు తెలుసురా నీసంగతి! అయిందేదో అయిపోయింది. మీయిద్దరకూ తగిన ప్రాయశ్చిత్తం నేను చేస్తాను. యింటికి పదండి. ఆ మూడు ముళ్లూ పడితేనే కాన్నీ నీకు బుద్ధిరాదు.

సు:-(సరోజ వంకచూస్తూ) యీ నాటకం అంతా నీవు ఆడిందేనా సరోజా?

స:-అవును నన్ను క్షమిస్తారుకదూ?

సు:-అమ్మదొంగా! ఎంతపన్నాగంపన్నేవు? సంబంధంలేనిదాని మల్లే దగ్గరకుచేరి ఎంత నాటకం ఆడేవు! ముందుగా వెంకట్రావు గారమ్మాయినని నాకు ఎందుకు చెప్పలేదూ?

స: చెప్తేనన్ను మీరూములోఉండనివ్వరు. కథకూడా యింతవరకూ వచ్చేదికాదు

సు:-సరే యింటికిపద నీపని చెప్తాను.

సత్యం:-లేవండి లేవండి. ట్రయినుకు వేళయింది.

(ముగ్గురూ నిష్క్రమిస్తారు)

—o—

(424-వ పేజీ తరువాయి)

ఆ మనిషి సంగతి తలపెట్టటానికి వుత్సాహ పడరుకూడా!

ఇలాటి పెద్దమనుషులతో ఇలా అంటామనుకోండి!

"నా ఇల్లు చాలా పెద్దది. ఆధునిక వాస్తుశాస్త్రం ప్రకారం ఆ ఇంటికి కావాలసిన హంగులన్నీ చక్కగా వున్నాయి. డాబామీద పావురాలకి నివాసయోగ్యంగా గూళ్లనుకూడా కట్టాను." ... ఇలా మనం కట్టివాడుకుంటూవున్న ఇండ్ల సంగతి ఇలాటి మనుష్యులముందర ప్రస్తావిస్తామనుకోండి. దానిని వినటానికి వాళ్లకు వుత్సాహంవుండదు. అంచేత అలాంటి కబుర్లని వదిలేసి ఇంకొక దోవకి వస్తూ

"ప్రత్యక్షంగాఒక భవనాన్ని చూశాను దాన్ని కట్టటానికి సొమ్ము లక్షకుపైగా అయిందన్ని అన్నానా ఇక వాళ్ల వుత్సాహాన్ని వుద్వేగాన్ని మాటలతో చెప్పాలా!

అలాగే మనం ఇటువంటి వాళ్లకు గ్రహాలాసంగతి చెబుతూ "ఇలాటి గ్రహాల్లో ఒక దాన్నుంచి ఇక్కడికి స్వయంగా వచ్చిన రాజకుమారుడ్ని చూశాను. ఎప్పుడూ మందహాసం చేస్తూ వుంటాడు. ఆడుకోటానికి మేక పిల్ల కావాలని అడిగాడుకూడా ఆ అబ్బాయి" అని అన్నామా తలనూపుతారు. మందహాసంచేసి వూరకుంటారు. త్వరలో నిశ్శబ్దం ఉదాసీనం ... అయినా సారకాయలు కోస్తూ "ఆ అబ్బాయి వచ్చిన గ్రహం నెం. బి 612 "అని బల్లగుద్దినట్లు అన్నామా, తిన్నగా దోవలోకి వస్తారు. వాళ్ల పద్ధతిలో బోలెడు ప్రశ్నల్ని మనమీద విసిరివేస్తూ ఇంకా ఎన్నెన్నో వివరాలని తెలుసుకోటానికి వుబ్బితబ్బిబ్బవుతూ వుంటారు. అయినా మనం ఇచ్చే జవాబులన్నీ అంకెలమీదతూ. చా తప్పకుండా నడిచిపోవాలసి వస్తుంది. అది వాళ్ల తరహా. అలాటి వాతావరణంలో పుట్టి పెరిగినవాళ్లు ఈ మహానీయులు. – ఈ ఖగోళ శాస్త్రజ్ఞులు.

అలాటి చప్పటి భోగట్టాలో మనమూ తృప్తిపడుతూవుంటే అసలుకే మోసం వస్తుంది. రక్తి కట్టటం అనేది ఎలా సంభవిస్తుంది ఇలాటి తర్జన భర్జనల్తో!

ఆ గ్రహాలను గురించి, వుపగ్రహాలని గురించి మనం చక్కగా తెలుసుకోవాలంటే ఆ విషయమంత కథలకు మల్లె గాథలకి మల్లె గబగబ దొర్లుతూ వుండాలి. కాని ఆసంగతినంతా ఎలా అంత వుత్సాహంతో చెప్పగలుగుతానోమీరే చెప్పండి! ఆ అబ్బాయిని తలుస్తూవుంటే ఆ మేకపిల్లను తీసుకుని అంత తొందరగావాడు అదృశ్యమైపోతూవుంటే! ఈ సంఘటన జరిగి ఆ రేండ్లకు

పైగానే అయింది. అబ్బాయిని తలుచుకుంటే గుండె గబగబ కొట్టుకొంటూ వుంటుంది. ఆ మందహాసవదనాన్ని తిరిగీ ఎప్పుడూ చూడటం? వాడు అడిగిన అమాయకపు ప్రశ్నలను నెమరువేస్తూవుంటే కన్నీరు ఏకధారగా కారుతూవుంది.......

అబ్బాయి వయస్సు అప్పటికి ఆరేండ్లే! ఎంత చక్కని పిల్లవాడు. కోమలత్వంలో వాడ్ని అనే ఇతర్లని ప్రస్తావించాలి. ఆ చిలిపిచేష్టల్లోకూడా ఎన్నో కళాకాంతులు వున్నాయి. వాడి రూపాన్నే చిత్రించాలని వుబలాటపడితేనో? ఆ అబ్బాయిని తలుస్తే, వాడి బొమ్మను రాయాలని వుబలాటం వుండక మరేం వుంటుంది ? .. కాని ఎలా చిత్రించటం? చిన్న అబ్బాయిగానా, లేక పెద్దవాడిగానా? ... ఆ పనికి ప్రయత్నించాను. కాని వాడు వేసుకున్న దుస్తులని చిత్రించబోయే టప్పటికి వెలగకాయ నోట్లో చిక్కుకున్నట్లు అయింది. ఆ దేదీప్యమానమైన దుస్తులకి ఏరంగులు వాడాలి? నా దగ్గరవున్న రంగులతో వాటిని రాయటానికి ఎలా సాధ్యమవుతుంది? ఆ సహజమైన రంగులు ఒక ఎత్తు, ఈ కృత్రిమవర్ణాలు ఒక ఎత్తు. రెంటినీ సమన్వయం చేయటం బ్రహ్మకు కూడా సాధ్యమైన కార్యంకాదు అని బల్లగుద్దినట్లు చెప్పవచ్చు. ఆ మందహాస వదనాన్ని చూపటానికి నా తరమవుతుందా? వాణ్ణి ఒకసారి చూడాలి. కళ్ళార తనివితీరా చూడాలి. వాణ్ణి చూడటం ఎలా? ఎక్కడికి వెళ్ళాడు ఇంతకూ? తన వివరాలు నాకు చెప్పిన పాపాన పోయినవాడు కాదేమరి! నాకు అంతా తెలుసని కాబోలు ఏంచెప్పక అలా చప్పున వెళ్ళిపోయివుండాలి! అంత తెలివితేటలు నాకు వుంటేగా! అప్పుడే కొంచెం మెలకువగా వుండివుంటే నా తెలివితేటల్ని యథాతథంగా ఆ పనికి వుపయోగించేవాడ్నే కాబోలు. ఇప్పుడు వయస్సులో పెద్దవాణ్ణిఅయిపోతున్నాను. నా మనోభావాలు నా వయస్సు వాళ్ళ వాతావరణంలో మునిగి తేలుతూ వున్నాయి. అంచేత నా సహజ శక్తులు ఎలా రేకెత్తగలుగుతాయి ఇలాంటి ఆడంబరపు పరిసరాల్లో? ... ...

(400-వ పేజి తరువాయి)

చెప్పండి - ఆ విషయం చెప్పండి" అంటూ ఆమె ఏడవడం మొదలు పెట్టింది. ఆమెను ఓదార్చడం ప్రసాద్ వల్లకాలేదు. ఏవేవో అనునయ వాక్యాలు పలికాడు, క్షమాపణకూడా చెప్పుకొన్నాడు. ఫలితం శూన్యమైంది. భారతి ఒక్కమెట్టయినా దిగిరాలేదు. రాత్రి భార్యాభర్త లిద్దరికీ భోజనాల్లేవు. తెల్లారిందికాని భారతి కోపం మాత్రం చల్లారలేదు. రాత్రల్లా ఆమె తీవ్రంగా ఆలోచించింది. తన దౌర్భాగ్యాన్ని తిట్టిపోసుకుంది. తన కలాంటి భర్తనిచ్చినందుకు దేవుణ్ణి శాపనార్థాలు పెట్టింది. చివరికి తెల్లవారు ఝామున వొక తీర్మానానికి వచ్చింది.

పెట్టె బేడా సర్దుకొని "నేను పూరి కెళ్తున్నా" అంది ఎదురుగా నిల్చుని కిటికీవైపుచూస్తూ. ప్రసాద్ నవ్వుతూ "కోపం యింకా తగ్గలేదన్నమాట" అన్నాడు. భారతి మాట్లాడలేదు. కొరకొర చూసింది.

"ప్రయాణం ఎక్కడికీ?"

"ఇంకెక్కడికి మా యింటికి" అని ఘాటుగా సమాధానం చెప్పింది.

"ఇది ఎవరి యిల్లు?" తీక్షణంగా అడిగాడు ప్రసాద్.

"మీది"

"ఊం సరే - అయితే నీ యిష్టం. ఇది నీ యిల్లు అనుకున్నప్పుడే తిరిగిరా" అన్నాడు కోపంగా. అక్కడ్నుంచి విసురుగా వెళ్ళిపోయాడు.

ఆవేళే భారతి పుట్టింటికి వచ్చేసింది. అమ్మ నాన్న విస్తుపోయారు కూతురు ఆకస్మికంగా రావటంచూసి. కారణం అడిగారు. బ్రతిమలాడారు. తను ససేమిరా చెప్పనంది. స్నేహితురాళ్ళచేత అడిగించి చూశారు. అది లాభంలేకపోయింది. ఇంకమీదట తను భర్త దగ్గరకు వెళ్ళడం అసంభవమని, అన్ని బంధాలు తెంచుకొని వచ్చేసినట్టు కుండ బద్దలుకొట్టి చెప్పింది. తన నిశ్చయాన్ని మార్చడానికి యింక ఎవరితరముకాదని దృఢంగా నొక్కి చెప్పింది. కూతురు ధోరణి అమ్మా నాన్నకు విచిత్రంగా తోచింది. చెప్పి చెప్పి లాభంలేక, కొన్నాళ్లు యింట్లోవుంటే దానికే తెలిసొస్తుందిలే ఆ బాధ అని సరిపెట్టుకున్నారు వాళ్లు.

రెండునెలలు గడిచాయి. ఇంట్లో ఎవరూ ఆ ప్రస్తావన మళ్లీ తీసుకురాలేదు. మూడోనెల మొదలు పెట్టింది.

భారతి ఊహలు పరిపరి విధాలుగా పోతున్నాయి. ఆమె మనస్సులో అనుకున్నదొకటి అయిందొకటి. కొన్నాళ్లు ప్రసాద్ ముఖం చూడకపోతే ఆయనే తన్ను వెదుక్కొంటూ వస్తాడని అభిప్రాయపడింది. దాని కిప్పుడు భిన్నంగా

జరిగేసరికి ఆమెకు పట్టరాని ఆవేదనా, ఆవేశమూ రెండూ కలిగాయి. రోజు రోజుకు కోపం - పట్టుదల అధికంకాజొచ్చాయి. ఇదివరకైతే ఒకవేళ భర్త చెప్పే తియ్యటి మాటలకు లొంగిపోయికూడా వెళ్లుండే దేమోగాని, - చస్తే యిప్పుడలా చెయ్యటానికి ఒప్పుకోదు. వచ్చిన దారినే భర్త తిరిగి పోవాల్సిందేగాని మరొక విధంగా జరగదు. అంత గట్టిపట్టుదలా, దృఢ నిశ్చయం పెనవేసుకుపోయా యిప్పుడు హృదయంలో. ప్రసాద్ మీద మమతను తగ్గించుకోవాలని, క్రమక్రమంగా అతన్ని మర్చిపోవాలని ప్రయత్నిస్తోంది భారతి. ఎంతగా మనసును ఆయన్నుంచి దూరం చేసుకోవాలనుకున్నా రాత్రులందు ప్రసాద్ తప్పకుండా జ్ఞాపకం వచ్చేవాడు. తనవైపు కొంటెగా చూస్తున్నట్టు, నవ్వుతూ సమీపిస్తున్నట్టు దృశ్యం మనోనేత్రాలను తాకుతూవుండేది. రాత్రిపూట సరిగా నిద్ర పట్టేదికాదు. ఏదో దిగులుగా - అదో విధంగా వుండేది మనసు. భారతి నిద్రలో ఏవేవో పలవరిస్తూ వుండేది. భారతి అవస్థ చూసి అమ్మా నాన్న బాధపడేవారు.

ఒకనాడు భారతి తల్లి "ఇద్దరిద్దరే పసివాళ్లు, ఏ మాట పట్టింపులు వచ్చాయో ఏమో .... మీరొకసారి అల్లుడిగార్ని చూసిరండి" అని ప్రబోధించింది భర్తకు. భారతి ఆ ప్రక్కనేవుండి, "వద్దునాన్న! నువ్వెళ్లొద్దు ... ఆయనొచ్చినా నే వెళ్లను ... అంతగా అవసరమైతే ఎక్కడైనా పడిచస్తానుగాని ... "అని గర్జించింది.

"ఆయ్యో అవేంమాటలు - ఛి ఛీ - బాగానేవుంది. ఊర్కో వేతల్లీ. ఆపన్లుచేసి మమ్మల్నెందుకు శోభపెడతావు. నీకిష్టం లేకపోతే ఎవరూ వెళ్లర్లే" అని సముదాయించింది. భారతి నాన్నకు మతిపోయినట్టుంది.

♦ ♦ ♦

ఉదయం తొమ్మిది గంటలప్పుడు యింటి ముందు బండి ఒకటి వచ్చి ఆగింది. అంతే దానితో మొదలైంది ఆయింట్లో కలవరం.

"అక్కయ్యోయ్! బావొచ్చాడే" అంటూ తమ్ముడు పరుగెత్తుకొంటూ వెళ్లాడు భారతిదగ్గరికి. "ఛీ - పోరా" అని కసిరికొట్టింది ఆమె. తమ్ముడు తెల్లబోయాడు. ఆమె మొహంలో కోపం - చిరాకు చూచి, మరేమీ పలక్కుండా మెల్లగా జారుకున్నాడు.

ఆవేళ అల్లుడిగారి రాకతో అత్తగారి మొహం చాటంతైంది. మామగారు మామూలుగానే అల్లుణ్ని పరామర్శించాడు. వంటింట్లో పెద్ద హడావిడి జరుగుతూంది. అల్లుడికి ఎంతో ఘనంగా మర్యాద జెయ్యాలని అత్తగారి ఆకాంక్ష. ఆ పూట కూతురు ధోరణి చూసి ఆమెగుండె దడదడ

కొట్టుకోసాగింది. తనవంశానికి అప్రతిష్ట కలుగుతుందేమోనని భయపడి పోయింది. సావిట్లో వున్నభర్తను కేకవేసింది. –

''ఏమండోయ్. ఎంతపని జరిగిందో చూశారా. అమ్మాయి యిందాక బావిలో పడబోయింది. నేనుండబట్టి సరిపోయింది గాని ... లేకపోతే నా తల్లి యీ పాటికి ...'' అంటూ ఆమె కన్నీళ్లొత్తుకుంది.

''ఇప్పుడే మొచ్చిందట.... అల్లుడొచ్చాడుగా'' అన్నాడు ఆయన సగం విసుగుతో, సగం కోపంతో.

''అమ్మాయి అతనితో వెళ్లదట''

'ఆఁ – వెళ్ళక – ఏంచేస్తుందేమిటి – అంతా వేషాల్లే. మహాబాగా వెళ్తారు. నువ్వూర్కో ''

''అయ్యో యింత అమాయకులేమండీ మీరు! ఆ పిల్లమనసు విరిగిపోయిందండి. చివరికి చావుకూడా తెగిస్తుంటే ...''

''పెద్దచిక్కు వచ్చిపడిందే. నన్నేం చెయ్యమంటావు. ఇష్టముంటే వెళ్లమను. లేకపోతే ఆ మాట దాన్నే మొగుడుతో చెప్పమను. అంతే'' అంటూ ఆయన వెళ్లిపోయాడు.

''ఖర్మ'' అనుకుంటూ నెత్తి బాదుకుందామె

మధ్యాహ్నం భోజనాలయ్యాయి. ప్రసాద్ ఎంత ఆశతో యిక్కడికి వచ్చాడో అంత నిరాశ పడ్డందుకు కలరపడ్డాడు. భార్య తనకంటబడకుండా ఏం చేస్తున్నట్టూ ? తనొచ్చాడని తెలిసికూడా యింకా ఏమిటా మొండిపట్టు అనుకొన్నాడు మనసులో. చీమ చిటుక్కుమంటే భార్యేమోనని ఆతురతగా చూస్తూ చాలసేపు వొంటరిగా వుండి పోయ్యాడు. బావమర్దిని పిలిచి వాళ్లక్కయ్యను పిలిచి రమ్మని చెప్పాడు. ఆమె రానని సమాధానం చెప్పి పంపింది. ప్రసాదుకు బావమరిదిముందు ఆ జవాబు చాల చిన్నతనమనిపించింది. కొంచెంసేపుండి తనే భారతి వున్నగదిలోకి దారితీశాడు. మెల్లగా తలుపు తోసుకుని అడుగుపెట్టాడు శబ్దం చెయ్యకుండా.

భారతి మంచం మీద బోర్లా పడుకొని తలగడలో తలదూర్చి ఏదో ఆలోచిస్తోంది.

''భారతీ!''మెల్లగా పిల్చాడు ప్రసాద్.

ఆమె త్రుళ్లిపడి లేచి నిల్చుంది. ప్రసాద్ దర్శనం ఆమె నోక చెంపన చెల్లుమని కొట్టినట్లనిపించి, రోషం ముందు కొచ్చింది.

''ఎందుకొచ్చారు ? ... నేను రాను వెళ్లండి''అని అరిచింది. ప్రసాదు నవ్వుతూ ఆమె ముఖంకేసి తేరి పార చూశాడు.

కోపంలో ఎంత అందంగావుంది అనుకు న్నాడు మనస్సులో.

"వెళ్లండి నేను మీకేమీ కాను" అని పెద్దగా అరిచి, ఆ గదిలోంచి వెళ్ల బోయింది భారతి.

ముందుకు చాచాడు. జడ చేతికందింది. బల వంతంగా తనవైపుకు లాక్కుని ఆమెను తన కౌగిట్లోకి తీసుకున్నాడు. చిబుకాన్ని పట్టి ఎత్తి మోములో మోము చేర్చాడు ఆప్యాయంగా.

ప్రసాద్ ఆమెను ఆపడానికి చేతులు ఆమె కాదన [illegible] రించనూలేదు!

—(o)—

# స్వీకారము

బాలరాజ్యం: అనువాదకులు - శ్రీ యన్. ఆర్. చందూర్. ప్రచురణ కర్తలు: కుబేరాప్రింటర్స్ లిమిటెడ్, 21 సుంకురామ చెట్టి వీధి, మద్రాసు, వెల 50 నయాపైసాలు.

ఇది దిక్కు మొక్కు లేని వివిధ జాతులు, మతాలకు చెందిన బాలలను తనదరిచేర్చి విద్యాబుద్ధులు గరపి, వారిలో సమరసమైక్యతలను, సద్భావమును పూరించి ప్రకాశవంతమగు భవిష్యత్‌ను రూపొందించిన రోమన్ కాతలిక్ మతగురువు ఎడ్వర్డ్ జోసఫ్ ఫ్లానగన్ జీవితచరిత్ర. ఇది ఆంగ్లమున ఫుల్టన్ ఔర్స్లర్, విల్ ఔర్స్లర్లు రచించిన గ్రంధమునకు ఆంధ్రానువాదం.

ఫాదర్ ఫ్లానగన్ దేవుణ్ణి మానవుని ప్రేమించి సేవించాడు. తత్ఫలితంగా ఆయన అమరలోకాన్ని చేరాడు. ఆయన ప్రేమానురాగాలు జాతిమతాలకతీతంగా అనేకమంది బాలలకు జీవితపురోభివృద్ధి కలిగించినవి. సేవాత్యాగాలను ప్రబోధించే బాలరాజ్య నిర్మాత జీవితచరిత్ర పఠనీయమేకాక ఫాదర్ ఫ్లానగన్ జీవితవిధానము అనుసరించతగినది. ఈ చక్కని అనువాదం ప్రతియొక్కరు చదువతగినది.

శ్రీ కనకదుర్గానందలహరి: శ్రీ విద్యాశంకర భగవత్పాద విరచితము. ప్రకాశకులు: సాధన గ్రంధమండలి, తెనాలి. వెల 25 నయాపైసాలు.

భారత భూమిని, ఉపనిషత్ప్రతిపాదితమైయున్న వైదిక మతమును ప్రతిష్ఠించి సముద్ధరింప కాలడి గ్రామమున నవతరించిన శ్రీ ఆదిశంకరులు విజయవాడ యందలి కనకదుర్గాంబికను స్తుతించుచు వ్రాసిన వింశతి శ్లోకములు. అతిరమణీయముగా నున్నవి. భక్తులు కంఠస్థము చేసి దేవీ యనుగ్రహకటాక్షములకు పాత్రులగుటకనువుగానున్నవి.

—(o)—

# సంపాదకీయములు

## స్త్రీలకు ఉద్యోగాలు

ఆంధ్రప్రదేశ్ ముఖ్య మంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డిగారు మహిళలు ప్రభుత్వోద్యోగాలకు ఎగబడటం సముచితంకాదనియు, అంతకంటె వారు విద్యా, వైద్య రంగాలలో చేయగలసేవ ఎంతైనను కలదని ఉద్బోధించారు.

శ్రీ సంజీవరెడ్డిగారు చెప్పినట్లు స్త్రీలు అధ్యాపకులుగా, డాక్టర్లుగా, నర్సులుగా పురుషులకంటె మెరుగుగా రాణించగలరు. విద్యా వైద్య రంగాలలో స్త్రీల ఓర్పు, సేవాశక్తి, విజ్ఞాన వికాసములు ప్రజల శ్రేయస్సుకు, సౌభాగ్యమునకు విశేషముగా తోడ్పడగలవు. విజ్ఞానశాస్త్ర పరిశోధనా రంగంలో సయితము వారి శక్తి సామర్థ్యాలను, ఆర్జించిన అనుభవ విజ్ఞానములను స్త్రీలు లోక కళ్యాణముకొరకు ప్రేమ, సద్భావ వాతావరణములో వినియోగించగలరు. అంతేగాని ప్రభుత్వ కార్యాలయాల్లో గుమాస్తాలుగానో, లేక పోలీసులుగనో, సైనికులుగనో వారి కృషి, సేవ అంతగా రాణించదు. పైగా పురుషులతో పోటీపడుటవలన ఒకవైపు నిరుద్యోగం, మరొకవైపు చాలినంతమంది యోగ్యతలుగల అనుభవపరులులేమి వివిధ రంగాలలో నేర్పడటం వాంఛనీయము కానేరదు.

స్త్రీ తను చేస్తున్న ఉద్యోగం కుటుంబ జీవితాన్నిగాని, ఆరోగ్య సౌకుమార సౌభాగ్యములనుగాని మాపుచేసే పరిస్థితులలో నది మన జాతీయతకు భిన్నమైనదే కాగలదు.

## విద్యార్థులు – క్రమశిక్షణ

ఈ నాడు సంఘంలోని అశాంతికి, అరాజకానికి, అవినీతికి విద్యార్థులలో క్రమశిక్షణ క్రమంగా సన్నగిల్లుచుండుటేననుట పొరబాటుకాదు. అందుకనే రాష్ట్రపతి శ్రీ రాజేంద్రప్రసాద్ విద్యార్థిదశలో స్త్రీలు, పురుషులుకూడ క్రమశిక్షణ కలవాటుపడిననేగాని భవిష్యత్ జీవితంలో తమ బాధ్యతలను, ధర్మాన్ని తృప్తికరంగా నిర్వహించలేరన్నారు. విద్యార్థులుగా నలవరచుకోని క్రమశిక్షణను పౌరులుగా నలవర్చుకోలేరు. కాబట్టి తమ జీవయాత్రముందు ముందు సుగమంకావడానికి, ఆదర్శనీయమైన పౌరుడుగా తన శ్రేయో సౌభాగ్యములతోబాటు జాతీయ అంతర్జాతీయ రంగాలలో సయితము ప్రముఖపాత్ర వహించడానికి విద్యార్థులు తాముచేసే ప్రతి పనిని క్రమశిక్షణాబద్ధంగాచేయ నలవాటుపడాలి.

## బాలికలకు విద్య

బాలికలకు విద్యా సౌకర్యాలు మరింత విస్తృతం కావడానికి మద్రాసు ప్రభుత్వము ఒక ప్రణాళికను తయారుచేసి కేంద్రమునకు పంపినదట. అందులో చదువుకునే బాలికలకు ఉచిత మధ్యాహ్న భోజనము ఒక ఆకర్షణయని తెలియుచున్నది.

బాలురకుగాని, బాలికలకుగాని విద్యావసతులను విస్తృతముచేయుటకు పాఠశాలల సంఖ్యను పెంచితే చాలదు. వానిలో గరపే విద్య ఆకర్షణీయంగాను, భవిష్యత్ జీవయాత్రలో విద్యా విజ్ఞానములతో నుపయోగకరంగా నుండాలి. తల్లిదండ్రులకు పాఠశాలలలో తమ బాలబాలికలు అభ్యసించే విద్య తృప్తిని కలిగించాలి. దానితోబాటు బీదసాదలు సయితము విద్య నభ్యసించుటకు అవకాశములు విస్తృతము కావాలి.

## శ్రీ విళంబినామ సం॥ర నిజశ్రావణ, భాద్రపద మాసములు

| | | | |
|---|---|---|---|
| 1958 సం॥ ఆగస్టు నెల | 16 | శ | శుపా 4.25 ఏవ్యం 55.20 మఘ 14.54 |
| | 17 | ఆ | తది 54.2 పుబ్బ 11.57 |
| | 18 | సో | చవి 48.5 ఉత్త 7-28 |
| | 19 | మం | పం 41.51 హస్త 3.20 చిత్త 55.47 గౌరీవ్రతారంభం |
| | 20 | బు | ష 35-38 స్వాతి 54.53 |
| | 21 | గు | స 29.32 విశా 51.3 |
| | 22 | శు | అ 24.13 అనూ 47.38 వరలక్ష్మీవ్రతం |
| | 23 | శ | న 19.18 జ్యే 45.1 |
| | 24 | ఆ | ద 15.10 మూల 43.6 |
| | 25 | సో | ఏ 12.0 పూషా 42.22 |
| | 26 | మం | ద్వా 9-55 ఉషా 42.36 |
| | 27 | బు | త్ర 9.0 శ్రవ 44.13 |
| | 28 | గు | చతు 9.18 ధని 46-47 త్యాజ్యాభావః |
| | 29 | శు | ○ పౌ 11.2 శత 50.48 దేవీపవిత్రార్చనం |
| | 30 | శ | కృపా 13.51 పూభా 55-40 |
| | 31 | ఆ | వి 17.48 ఉభా 60.0 |
| 1958 సం॥ సెప్టెంబరు నెల | 1 | సో | త 22-25 ఉభా 1.43 శూన్యతిథి |
| | 2 | మం | చ 27-30 రే 8.6 త్యాజ్యాభావః |
| | 3 | బు | పం 32-35 అశ్వ 14-39 |
| | 4 | గు | ష 37-15 భర 20.23 |
| | 5 | శు | స 41-3 కృత్తి 26.28 మాధ్వ శ్రీకృష్ణజయంతి |
| | 6 | శ | అ 43.23 రోహి 30-39 |
| | 7 | ఆ | న 45.22 మృగ 34.36 |
| | 8 | సో | ద 45-46 ఆర్ద్ర 36.47 |
| | 9 | మం | ఏకా 44.53 పున 37.50 |
| | 10 | బు | ద్వా 42.36 పుష్య 37-30 |
| | 11 | గు | త్ర 39.27 ఆశ్లే 36.13 |
| | 12 | శు | చతు 35.8 మఘ 33-50 |
| | 13 | శ | ● అమా 30.17 పూఫ 20.52 |
| | | | **భాద్రపద మాసము** |
| | 14 | ఆ | శుపా 24.47 ఉఫ 27-12 |
| | 15 | సో | విది 18-54 హస్త 23-13 కల్కిజయంతి |

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press,
Kesari Kuteeram (Private) Ltd. 15, Westcott Road, Royapettah, Madras.
Ag. Editor : C. C. Punniah.




## సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు 4-50. న.పై. అర్ధసంవత్సరపు చందా రు. 2-25. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి 40 న.పై. చందాదారులు ఏ మాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలా బిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

## ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీల కందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుట కీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలువుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

## వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమై యుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్రప్రచురణకు వీలగును. ఒకే ప్రక్కసిరాతో స్పష్టముగ తప్పులు లేక వ్రాయవలెను. భాష గ్రాంధికము గాని, వ్యావహారికముగాని, కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వ హక్కులు గలవు. ప్రకటింప నంగీకరింప బడినపుడు మాత్రము రచయితలకట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

## సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

## చిరునామా మార్పు

చిరునామాయందు మార్పున్నచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

## ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం ప్రైవేట్ లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

